చ. నట విట గాయకాళిని జనమ్ములు దుష్టు లటంచు దూరుచో
దిటముగ నాటకమ్మున సుధీజనవర్యులమెప్పు వొందఁగా
నెటు లగు నంచు శంక జనియించి నిరుత్సుకు లైతి మయ్య; ప్రా
కటముగ నిందితం బయినకార్యము మానుట యొప్పు గాదొకో. 2.

సూత్ర.—అహో, మంచిసమయమున మీకు శంక గలిగినది. [సవిచారముగా] నా మాట నమ్మి యిటఁజేరిన యీ సామాజికులు నన్నే మందురు! ఎట్టి విఘ్నము గలిగినది!

నటి.—ఆర్యపుత్త్రా, మీ మాటయందలి గౌరవముచేత పాత్రము లన్నియు సిద్ధమయి యున్నవి. నాటక మాడుటకు ప్రయత్నమంతయు సమగ్రమే.

సూత్ర.—ప్రియసఖీ! తెలిసినది తెలిసినది. నాటక మాడుదురుగాని మనంబునఁ దగిలిన శంకచే పాత్రములు తమ తమ నేర్పు సంపూర్ణముగఁ జూపఁజాల రని హెచ్చరిక చేయుచున్నావు. మీ శంకం దొలఁగించెద.

నటి.—అటయిన మన యాట యద్భుతావహముగా నిర్వర్తిల్లును.

సూత్ర.—అవును.

గీ. సకలశక్తులలోన నుత్సాహశక్తి
మేటి యందురు బుధజనుల్ మెలఁత, యెట్టి
బుద్ధిశాలికి నది లేక పూర్ణముగను
దనదు ప్రతిభను జూపంగఁ దరముగాదు. 3.

నటి.—కావున నిరుత్సాహులై యున్న మన పాత్రముల కుత్సాహంబు గల్పింపుఁడు.

సూత్ర.—నాటకము లాడిన సుధీమణుల మెప్పునకు మాఱుగా వారి నిందకుఁ బా లగుదు మని కదా వారిశంక.

నటి.—వేసము వేయువారి మొగముఁ జూడరా దని కదా లోకోక్తి?

సూత్ర.—అట్లు కాదు.

క. వేసము వేయుట యొక బలు
దోసం బని చెప్ప నగునె? తొల్లిటి ధీరా
గ్రేసరుల చరిత లాడుట
చే సలుపమె జనుల కొక విశేషోపకృతిన్? 4.

క. కలిగించు సజ్జనావళి
కలఘుతరంబైన హర్ష మార్యచరిత్రం

బులు, చూచుట వినుటయు దు
ష్టులకుఁ జ్ఞానమ్ము నొసఁగుఁ జుమ్మీ చెలియా. 5.

ఈ కాలమందు నాటకము లాడువారు సామాన్యముగ దుష్ప్రవర్తనము గలవా రగుటంజేసి యిట్టియాడిక కలిగెనే గాని వేసములు దాల్చి నాటకము లాడుట దూష్యమైనపని గాదు. నిజ మరసిన, నాటకము లాడుట హరికథాపఠనమువలెనే యోగ్యమైనపనియే యగును.

నటి.—ఇది సర్వజన సమ్మతము కాదు గదా? ఎంత యోగ్య మైనపని యైనను సర్వజనసమ్మతము కాదేని నిందపాలు సేయును గదా?

సూత్ర.—అవును గాని, లోకనింద కోడి యుచితకార్యము చేయుటకు వెనుదివియుట ధీరుని లక్షణము కాదు.

ఉ. ధీరుఁడు లోకనిందను మదిం గణియింపక పట్టుగల్గి యా
పూరితధీరతం దనదు పూనినకార్యము యోగ్య మైన నే
తీరున నైన దానిని దుది న్నెఱవేర్చుఁ దదేకనిష్ఠుఁడై,
భీరుఁడు నింద గల్గు నని భీతిలి యుజ్జనసేయు దీనుఁడై. 6.

క. పలువురు మెచ్చినఁ జేయుట
పలువురు నిందింతురేని భయ మందుటయుం,
దలఁపఁగఁ బిఱికితనం బిది;
కలదే భేదంబు నీకు గాలిపడగకున్. 7.

క. ఎద నెయ్యది యొనరించినఁ
బదుగుర కొక్కింత మేలు వాటిలు నని న
మ్మెదవో, పరులకు భయపడి
యది చేయఁగ జంకు టరయ హైన్యము కాదే? 8.

గీ. సకల కార్యమ్ములందును సర్వసాక్షి
యైన పరమాత్మునకుఁ బ్రీతి యగునొ కాదొ
యెన్నవలెఁ గాక, యన్యుల నెన్న నేల?
యొకని పాప పుణ్యంబు లిం కొకని వగునె? 9.

ప్రతిపురుషునకును దనకర్తవ్యము కాదని తోఁచినపని చేయుటకు మనోబల ముండుట యొప్పు. అట్టి మనోబలము పురుషున కలంకారము. ఏల యనిన—

క. ఇల నుచితానుచితమ్ములు
దెలిసినవా రేమి యరుదు? ధృతితోడ మదిం
దలఁచుగతి నడచు సుజన
మ్ములు మాణిక్యములువోలెఁ బొల్చెడి నరుదై. 10.

మదిలోన నొకటిఁ దలఁచుచుఁ బయటి కొకటి చెప్ప వేసము దూష్యము గాని, నాటకము లందు వేసము వేయుట దూష్యము కాదు. మొదటి వేసము లోకమును వంచించుటకు. మన వేసమున నట్టి వంచన లేదు. కావున, శంక దక్కి మీ నేస్వంతయుఁ దేటపడ హిత బోధకం బగు నొక పురాణపురుషుని సచ్చరిత్రంబు నాటకం బాడి యీ సామాజికుల కానందంబు గావింపుఁడు.

నటి.—ఆర్యపుత్రా, మాశంక వీడినది. ఇంత దనుక తగ్గియున్న యుత్సాహ మిప్పు డినుమడి యైనది. మఱియు నీరాత్రి యేనాటకము ప్రయోగింప నాజ్ఞాపించెదరు?

సూత్ర.—శ్రీమంగళగిరి యను దివ్యక్షేత్రంబున నాయుర్వేదంబున నపరధన్వంతరి యని కీర్తిఁగాంచిన నంబూరు బలరామప్రధానికిని శ్రీలక్ష్మీదేవికినిఁ బుత్త్రుండును, కృష్ణ కవిశేఖరునకుఁ బౌత్త్రుండును, కొండుభట్ల సుబ్రహ్మణ్యశాస్త్రివరునకును నాగపూడి కుప్పుస్వామ్యార్యునకును వేదము వేంకటరాయశాస్త్రివర్యునకును సచ్ఛాత్త్రుండు నగు నంబూరు తిరునారాయణస్వామి నామధేయుం డగు నొకముగ్ధకవి రచియించిన రుక్మాంగద చరిత్రమును బ్రయోగింపవలయును.

నటి.—ప్రౌఢకవులు వ్రాసిన నాటకములు పెక్కు లుండ నీముగ్ధకవి రచియించిన యీ నాటక మేల?

సూత్ర.—ప్రేయసీ, ఈ నాటకమును సభాసదు లుచితరీతి నాదరింప రని జంక వలదు.

చ. గురువులు గొప్పపండితు లకుంఠితభక్తిని వారిఁ గొల్చి త
త్కరుణకుఁ బాత్రుఁడై కఱచెఁ గావ్యములుం, బదలక్షణంబులున్;
గురువులఁబట్టి యైనను దగుం జుమి యీ కవి నాదరింపఁగా,
సరసులుగారె సభ్యులు, ససారము గైకొని సంతసింపఁగాన్. 11.

యశోధను లైన వేదము వేంకటరాయశాస్త్రివర్యులను నీ వెఱుఁగవా? ప్రతాపరుద్రీయము మున్నగు మహానాటకములు రచించిన మహాకవి. ఆమహానుభావుని శిష్యుఁడు ఈకవి. ఈనాటకము మనోరంజకముగానే యుండును. ఏలన,

# నాటకపాత్రములు.



## పురుషులు.

రుక్మాంగదుఁడు.—విదిశాపురాధీశ్వరుఁడు కథానాయకుఁడు.

ధర్మాంగదుఁడు.—రుక్మాంగదునికుమారుఁడు.

శృంగి, వసిష్ఠుఁడు, నారదుఁడు.—ఋషులు.

యముఁడు.

బ్రహ్మ.

ధూమ్రాక్షుఁడు, చండముఖుఁడు, కుంభోదరుఁడు - యమకింకరులు.

ముక్తులు.

ఆత్రేయులవారు.—పురోహితుఁడు.

జీవులు.—సూక్ష్మశరీరమాత్రులై యమపురంబునఁ బరీక్షింపఁబడు పురుషులు.

చిత్రగుప్తులు.—లేఖకులు.

విదూషకుఁడు.—రుక్మాంగదుని వేడుకకాఁడు.

శ్రీమహావిష్ణువు.

## స్త్రీలు.

సంధ్యావళి.—రుక్మాంగదునిపట్టమహిషి.

పుణ్యశీల, సాధుమతి.—రాజపత్నులు.

ఇందీవరిక, చతురిక.—వారిచెలికత్తెలు.

మోహిని.—రుక్మాంగదుని చిత్తశుద్ధిఁబరీక్షింప బ్రహ్మచేనంపఁబడిన దివ్యాంగన.

సాగరిక.—ఆమెపరిచారిక.



శ్రీ.

## దేవతాదిస్తుతి.

---

ఉ. శ్రీకరుఁడై జగంబులను సృష్టియొనర్చుచు నొక్కలీల ర
క్షాకలనంబునం జెలఁగి కట్టకడన్ లయమందఁజేయు సు
శ్లోకుని భక్తపాలనవిలోలుని శ్రీహరి నాత్మఁ గొల్చెదన్,
బ్రాకటభక్తి నిచ్చలు శుభప్రదుఁడై నను బ్రోదిసేయఁగాన్. 1.

చ. తెనుఁగున భారతంబు తఱితీపున నొప్పెడితేటమాట లిం
పొనరఁగఁ గూర్చి వ్రాసిన మహోజ్జ్వలసత్కవితాఢ్యు నన్నపా
ర్యుని, మహితార్థగౌరవనిరూఢి సెలంగ రచించినట్టి తి
క్కన, నిరుచందము ల్వొలయఁగా రచియించిన శంభుదాసునిన్,
మనమునఁ బ్రస్తుతింతు, నసమానకవిత్వవిభూతిసిద్ధికిన్. 2.

మ. వినుతింతుం గవితాపితామహుని ధీవిఖ్యాతునిన్, భట్టుమూ
ర్తిని శ్లేషార్థిని, సూరనార్యు, కవితాశ్రీనాథు శ్రీనాథుఁ, ది
మ్మన స్వాదూక్తినిఁ, బుణ్యుఁ బోతనకవిం, బ్రజ్ఞానిధిన్ రామకృ
ష్ణుని, సోమన్నను, భాస్కరాదికవిసందోహంబు సద్భక్తి మై. 3.

గీ. ఆంధ్రగీర్వాణభాషామహాంబునిధులఁ
ద్రచ్చి సారామృతం బాని ధన్యుఁడైన
నాదు గురువర్యుఁ గొలిచెద వేదవంశ
జలధివిధుని వేంకటరాయశాస్త్రివర్యు. 4.

---

క. అతినిపుణత గల ప్రౌఢల
చతురతఁ గని సంతసించు సరసులె పుడమిన్
జతురత యెఱుఁగని ముగ్ధల
మితిలేని ప్రియమ్ముతోడ మెత్తురు కాదే. 12.

ఇఁక నాలసింపఁ దగదు. నీ మధురగీతము వినవలయు నని కౌతూహల మందుచున్న సభాసదుల యుల్లంబులు రంజిల్ల నీ వసంతఋతువును వర్ణించుచు నొక్కపాట పాడుము.

నటి.—చిత్తము.

క. లస దభినవసుమకోరక
విసరంబుల్ లతలు వెలయఁ, బికమధుపము లిం
పెసలారుపాట పాడఁగ,
నసమోత్సవముల వసంత మలరారు నిలన్. 13.

జంఝూటి రాగము.

1. భోగానుకూలకాలమై పొసఁగె నామనీ
పూగ పున్నాగ వకుళ పుష్పసంశోభియై. భోగాను.

2. సారకుసుమ సౌరభాఢ్య మారుతాంచితంబు నై
గీర పిక మయూర మధుప గీత శోభితంబు నై. భోగాను.

3. ప్రకట కుసుమబాణ శౌర్యవర్ధన ప్రవీణ మై
పాంథలోక హరిణజాల ప్రబల శార్దూల మై. భోగాను.

సూత్ర.—భళి, భళి. ఏమి నీపాట సొగసు. ప్రతిదినమును వినుచుండు నాకే యింత యపూర్వ మనోహరంబుగ నున్నది! నీపాటకుఁ దగిన సభయునుఁ జేకూరినది చూడు.

ఉ. శృంగి వసిష్ఠ నారదులు శ్రీహరివాసరసువ్రతంబు పెం
పుం గణియింపఁ జోద్యముగఁ బుణ్యమతి న్వినుచుండినట్టి రు
క్మాంగదభూమిపాలుసభమాడ్కిని నీ సభ యొప్పు వేదవే
దాంగవిదుల్ కవీంద్రులు ధనాఢ్యులు కీర్తికలాపు లుండుటన్. 14.

[నిష్క్రమింతురు.

ఇది ప్రస్తావన.

# ప్రథమాంకము.

---

స్థలము - రాజసభ.

[సపరివారుఁడై రుక్మాంగదక్షితీంద్రుఁడు ఉపవిష్టుఁడై

ప్రవేశించును.]

రుక్మాంగదుఁడు.—సచివావతంసా! మనము మాళవ బంగాళ ఘూర్జర మహీపతుల కడ కనిచిన దూతలు ప్రత్యుత్తరములు గొనివచ్చిరా? కళింగనాథుని కడ కనిపిన సందేశ మెట్లు ఫలించె?

మంత్రి.—భూపురందరా! మాళవ బంగాళ ఘూర్జర మహీపతు లేలినవా రంపిన సందేశము నానతిగాఁ గైకొని శిరమున వహించివర్తించెద మని ప్రత్యుత్తరంబులును, నానా విధోపాయనంబులును, దూతలముఖంబున నంపిరి. దూతలు ద్వారమున వేచి యున్నారు.

రుక్మాం.—వారలను రప్పింపుము.

[దూతలు ప్రవేశించి నమస్కరించి దాము దెచ్చిన యుపాయనములను సింహాసనముముం దుంచి నిలుతురు.

మంత్రి.—దుబాసీ! ఈ యుపాయనంబులు ఒకటొకటిగాఁ దీసి ఏలినవారికిఁ జూపుము. [దుబాసి యట్లు చేయును.

[ఆకాశగమనంబున శృంగియు వసిష్ఠుండును హాజారము

కడ రత్నవేదికపైఁ బ్రవేశింతురు.]

శృంగి.—వసిష్ఠమహర్షీ! ఏమి యీపురము సొబగు!

సీ. ఏవాడఁ జూచిన నింపైన సౌధమ్ము,
లఖిలసంపదలకు నాకరములు,
ఏదిశఁ గనుఁగొన్న నేపారుతోఁటలు,
సకలర్తుసౌభాగ్య సంభృతములు,
ఏవంకఁ జూచిన దేవాలయమ్ములు,
భక్తజనానీక భజనగోష్ఠు,
లేమూల నరసిన హృద్య మాపిపణులు,
సురుచిరానర్ఘ వస్తువ్రజములు,

గీ. కలిగి యెచ్చోటఁ బరికింపఁ జెలిమి కలిమి
గ్రాల వర్తించు జనసముత్కరము వెలయ
నొప్పు నిప్పురి చెప్పకచెప్పు నీ నృ
పాలతిలకుని సౌజన్యవైభవముల. 1.

వసిష్ఠుఁడు.—చక్కఁగాఁ గనిపట్టితిరి.

చ. అనయము సత్యధర్మముల, నార్తిఁ దిరంబుగఁ బాదుకొల్పి, భూ
జనముల కెల్లసౌఖ్యముల సంఘటియించుచు, భూమిపాలనం
బొనరఁగఁ జేయు నీ నృపుని ప్రోజ్జ్వలకీర్తిమహాత్త్వసంపద,
ల్వినుతి యొనర్ప నేర్తురె, నిలింపగురుండు, విధాత, శేషుఁడుఁన్? 2.

చ. పలుకఁ డసత్య మాపలుకుఁ బ్రాణము మానముఁ బోవునట్టివే
ళల సయితమ్ము; ధర్మవు దొలంగి చరింపఁడు కష్టనష్టముల్
పెలుచనఁ గల్గినం; దనకు లేవడి గల్గు నటంచు లేశముం
దలఁగక యార్తులం దనిపి, దా భుజియించును, మీఁదఁ గల్గినన్. 3.

చ. ఎన యిడరాని సాహసము, నిం తనరాని వివేకవైభవం
బు, నిజము లెన్ని కల్గినను మొగ్గనిపూనిక తెంపుఁ, బల్కనం
బనులను నొక్కఁ డౌతలఁపుఁ, బాపభయంబుఁ, బరోపకారమం
దనయము బుద్ధి, మున్నగు గుణావళు లీతనిసొమ్ము లెన్నఁగాన్. 4.

చ. అనృతమునంద యాగ్రహ, మనాదర మన్యకథానులాపమం
ద, నయవిదూరదుష్టమనుజాళులపట్లనె క్రౌర్యముం, బరాం
గనలప్రసక్తియంద విముఖత్వ, మసూయ యధర్మవర్తనం
బునన; తరంబె యీ నృపతిపుంగవునం దొకతప్పు పట్టఁగాన్. 5.

శృంగి.—ఈ మహానుభావునిసందర్శనంబునఁ బావనుండ నయ్యెద.

[నారదుఁడు ప్రవేశించును.]

నారదుఁడు.—

శా. ఏ మీచోద్య, మి దేటిశాంత, మహహా! యెట్లబ్బెనో! భూపతి
స్తోమంబు ల్దమబీరము న్విడిచి గాజు ల్దాల్చి నిస్సారులై
యీమాడ్కిం జరియించువార లకటా! యెట్లోర్తు! నెట్లీరణ
క్షామంబుం దరియింతుఁ! గాదిటులు; నేఁ గల్పించెద న్వింతలన్. 6.

అకటా, ఈ రాజబృందములో నొకరుఁడైన నాకన్నులకఱవు దీఱఁ దనమగఁటిమిం జూపుచు విందు సేయువాఁడు గాన రాఁడు. ఏమియుం దోఁపక చీఁదఱ పుట్టుచున్నది. ఇసీ! పనిలేనిబ్రతుకు పాడుబ్రతుకు గదా!

గీ. చేతినిండుగఁ బని లేక చిత్తమునకు
సుఖము లేదు; శరీరము స్థూల మగుచు
భారమై దోఁచు; నొయ్యనఁ బటిమ చెడును;
నీచపథమున వర్తించు నెమ్మనంబు. 7.

శృంగియు వసిష్ఠుండును.—[నారదుం గాంచి సమీపించి] ప్రణతోఽస్మి ప్రణతోఽస్మి. నారద మునీంద్రా, మీకు రణక్షామంబు కలిగెనా? ఆబాధ తీర్చుకొనఁ దగిన స్థలమునకే వచ్చితిరి.

నారదుఁడు.—అహో తపోధనులారా, ఈ రాజు దండయాత్రా సన్నాహమున నున్నాఁడా యేమి?

వసిష్ఠుఁడు.—దండయాత్ర అనుమాట యాతని చెవిం బడరాదు గదా?

ఉ. ధూర్తనృపాలమండలముదుర్వశ మన్దిమిరంబు నాత్మస
త్కీర్తిమరీచికోటిఁ బ్రోలఁగించి, యవార్య భుజాపరాక్రమ
స్ఫూర్తి రణంబునం దెదిరిపోరెడుశూరుల కిచ్చు స్వర్గమున్;
మార్తురకైన నల్పుఁ డణుమాత్రము కీడు నృపాలుఁ డెప్పుడున్. 8.

ఇట్టివానికి దండయాత్రతోఁ బని యేమి?

నారదుఁడు.—ఈయనకును మీరే పురోహితులా? నిజముగా మీకంటెను మీ శిష్యకోటికంటెను విశ్వామిత్రుఁడే దండివాఁడు. అందును మీ రిరువురును దారసిలినప్పుడు గదా మాకుఁ బెనుపండుగ. ఆయనథాక కోడియే గదా యీపట్ల సంచారము.

శృంగి.—నారదమునీంద్రా! ఈ రాజచూడామణిసుగుణసంపత్తి వేనోళ్ల విని యీతనిసందర్శనకౌతుకము నాకొనఁగూర్పు మని నేనీవసిష్ఠమహర్షిని వేఁడితిని. ఆయన వలె యని నాతోడ నరుదెంచినాఁడు.

నారదుఁడు.—మఱి యీద్వారముఖమున వేచియుండ నేల, లోని కరుగుదమా?

వసిష్ఠుఁడు.—ఈ రాజు సపరివారుండై నిండుకొలువు దీరి రాజ్యతంత్ర మరయుచున్నాఁడు. పథిశ్రాంతి నిచట విశ్రమించితిమి.

నారదుఁడు.—అట్లయిన నేనును గొంతవడి యీ రత్న వేదికపై విశ్రమించెద.

[అని కూర్చుందురు.

రుక్మాంగ.—సచివోత్తమా! మాళవ బంగాళ ఘూర్జరమహీపతులకు వారి యుపాయనంబులకంటె వారి సౌహార్దంబు మామనం బలరించె నని దెలుపుచు ప్రత్యుత్తరములు వ్రాయించి తెప్పింపుము. కళింగనాయకుండు వ్రాయించినలేఖ చదివింపుము, విన కౌతుకం బయ్యెడు.

దుబాసి.—[చదువును.]

శ్రీమద్దిగంతవిశ్రాంతసాంద్రయశశ్చంద్రికావిరాజమానులును, శ్రీవిదిశాపురాధీశ్వరులు నగు శ్రీమద్రుక్మాంగదసార్వభౌములకు అవక్రవిక్రమకేసరిబిరుదాంకితుఁడు కళింగభూపాలుఁడు సస్నేహంబుగఁ జేయు విన్నపము. నిరవధికానుగ్రహరసప్రపూర్ణమైనయుష్మచ్ఛుభలేఖ సావధానంబుగ విని యమందానందసంభరితస్వాంతుఁడ నైతిని. మా విరోధులు తమ సన్నిధానంబున వ్రాసుచ్చు కొండెములు నిరర్థకంబు లయ్యె నని దెలిసికొని సంతసించితిని. తమ సౌహార్దంబు మాకుఁ బ్రసాదింపఁబడుటంజేసి మా కొక వజ్రకవచంబు లభించె. సన్నిధానంబున విన్నపము సేయఁదగు విశేషములు పెక్కులు గలవు. అచిరకాలమునఁ దమ సన్నిధిం బడయువాఁడ. చిత్తగింపవలయు.

రుక్మాంగ.—మంత్రిపుంగవా! చిరకాలంబునుండి నా హృదయశల్యం బైయున్న విచారము నేఁటితోఁ దీఱినది. సకలదేశాధీశ్వరులును మిత్త్రు లైరి. శత్రుశేషము లేకుండఁజేసిన మీ మంత్రపాటవమునకు సంతసించితిమి.

మంత్రి.—మే మాపని నెఱవేర్పలేనియెడ భండనభీము లగుదేవరవారి పరాక్రమంబె సమర్థంబు గలదు.

రుక్మాంగ.—మాకు దండనీతి ప్రియమ్ము సేయదు. సామ దాన భేద దండోపాయములు నాలుగును భూపాలురకు శత్రుజయోపాయము లయినను మొదటిరెండు మాత్రమే మా కిష్ట మయినవి. తృతీయము అనివార్యమైన నే యవలంబింపఁ దగును. నాలవది యగు దండోపాయము ప్రజాక్షయకారకం బగుటంజేసి ప్రయోగానర్హము.

వసిష్ఠుఁడు.—తాపసులారా! వింటిరా యీతని నీతిశాస్త్రపాండిత్యము. సర్వవిధముల నితఁడు శ్లాఘాపాత్రుఁడు.

రుక్మాంగ.—మంత్రులారా! కాశ్మీరదేశాధిపతి మన కంపినరత్నకంబళములును, నేపాళభూపాలుఁ డంపిన ఘనసారమృగమదాది సుగంధద్రవ్యములును, మాళవ బంగాళ

ఘూర్జరమహీపతులకును, కళింగనాథునకు నీ దూతలముఖంబున బ్రత్యుత్తరములతోఁ బంపుఁడు.

మంత్రులు.—ఏలినవారి యాజ్ఞ.

రుక్మాంగ.—ఇఁకఁ బ్రజాక్షేమముంగూర్చి విచారింతము. మా మతము మీ కెఱిఁగినదే కదా.

చ. జనులకొలంది యొన్న కనిశంబును బన్నులు బీల్చి పిప్పిగా
నొనరుచుదుష్టభూపతి మహోత్కట మైనదురాశ పీడచేఁ,
దనియక, మూఢుఁడై, పొదుగుఁ దద్దయు నిర్దయవృత్తి వ్రచ్చి పా
ల్దనియఁగఁ ద్రావఁగోరెడి యలంతి దురాశయుమాడ్కిఁ గుందఁడే? 9.

మంత్రులు.—ఏలినవారి యుత్తరువులు పూర్ణముగ నడుపుచున్నారము. వారల కేకొఱంతయు లేదు.

చ. అనుపమవత్సలత్వమున నారసి, దేవర ప్రోదిసేయ భూ
జనముల బిడ్డలన్ బలెఁ, బొసంగెడు నెట్లు కొఱంత లేశమున్?
ఘనముగ మేఘనాయకుఁడు గాలమున న్సమవృష్టి నిచ్చుచుం
దనుపుచునుండ సస్యసముదాయము పెంపువహింపకుండునే? 10.

గ్రామాధికారులును బెత్తనదారులును దేవరసందర్శనం బభిలషించి వచ్చియున్నారు; వారల ముఖంబుననే వారి కష్ట సుఖములు ఏలినవా రవధరింతురు గాక.

రుక్మాంగ.—సెబాసు. అదియును మాకు సమ్మతమే. వారలను రప్పింపుఁడు.

మంత్రులు.—ప్రతీహారీ, గ్రామజనులను తోడ్కొనిరమ్ము.

ప్రతీ.—చిత్తము. [అని నిష్క్రమించును.

[గ్రామాధికారులును బెత్తనదారులును ప్రతీహారి వెంటఁ బ్రవేశింతురు.]

గ్రామ.—దండాలు మహాప్రభూ, దండాలు. మీ తల్లికడుపు చలువను మాపూర్వ పుణ్యఫలముచేతను మనుమాంధాతలవలె వేనవేలేండ్లు పాలించండి.

రుక్మాంగ.—రండు. ఇటఁ గూర్చుండుఁడు. మీ మీ గ్రామములయందుఁ బ్రజలు సంతుష్టాంతరంగులై పాడిపంటలు గలిగి సుఖులై యున్నారా? మీరు మోమోటపడక యెచ్చట నేలోపము లున్నను విన్నవింపుఁడు. ఏల యన?

సీ. నరపాలుఁ డెంతగా ధరణీజనంబుల
సౌఖ్యంబు లరసిన సదయుఁ డగుచు,

రాజ్యతంత్రము దోషరహితమై యొప్పునే?
సర్వజ్ఞతంత్రుఁడే జనవిభుండు?
తాలిమి లేనట్టి ధరణీజనంబులు
కుపితులౌచుందు రా కోఁతఁ దెంచి.
ద్రోహచింతాసక్తదుష్టు లంచును వారి
పట్లఁ గోపించుట పాడి గాదు.

గీ. ప్రజలు సంకోచమును వీడి ప్రకటముగను,
దెలుపుకొనకున్న నెవ్విధిఁ దెల్లమగును
గాలభేదంపుమహిమచేఁ గలుగునట్టి
కష్టనష్టమ్ము లెల్లను క్ష్మాధిపునకు? 11.

గ్రామ.—మా కట్టిచనవు ఏలినవా రిచ్చుటవల్లనే మా కేకష్టము వచ్చినా మేము మనవి చేసుకోవడము, ఏలినవారు నివారించడము; తమ పాలనములో మా కేలోపమున్ను లేదు. ఏలినవారి కింకను రాజ్యము విస్తరించి మాయట్టిప్రజలను అసంఖ్యులను రక్షించు చుందురుగాక యని మాకోరిక.

రుక్మాంగ.—మీ కట్టివిశ్వాసము మాయెడం గలుగుట మాపూర్వపుణ్యఫలము. మా కోరిక అది గాదు. వంశక్రమాగతమైన మారాజ్యము మాకుఁ జాలును. ప్రజలకుఁ గష్టము దోఁపకుండ సర్వసౌఖ్యములు వారికి సమకూర్చుచుఁ బరిపాలింపఁజాలితిమేని మా కదే పదిరాజ్యముల సెట్టు.

క. ఆదరమొప్పఁగఁ బెంచిన
పాదప మొక్కటియె పండ్లు పదిరెట్లొసఁగుం
గాదె, తమయంత బ్రదికెడు
పాదపములకంటె నధికఫలవంతంబై. 12.

ఇఁక మాప్రకృతివర్గంబు సెట్లు సమ్మానించుచున్నవారలో విన్నవింపుఁడు. మా శాసనములు క్రమముగ నిర్వర్తించు వీరలు మా బహుమతికిం బాత్రులు.

వ. సతతము కార్యనిర్వహణచాతురి నారసి భృత్యకోటి నం
చితగతి నేల తేఁ డతనిచిత్త మెఱింగి చరించు భృత్యసం
తతియును, నొండొరుం గడువ; నాథుఁడు పాత్రత లెంచి నల్పు స
త్కృతి గలిగించుఁ జూవె భువిఁ సేవలనూతనశక్తియుక్తులన్. 13.

[మంత్రులును పరివారమంతయును లేచి నమ్రులై నిలుతురు.

నారదుఁడు.—భళిభళి, ఇట్టి సుగుణసంపత్తి యెట్లు వర్ణింపవచ్చును ?

సీ. దీనజనావనదీక్షచే నీ నృపుం
డవతార మెత్తిన యంబుజాక్షుఁ,
డంగనాజనమోహనాకారరేఖచేఁ
గాయంబుచెందిన కంతుఁ డితఁడు,
భూరిపరాక్రమస్ఫురణచే నీతండు
సాక్షాత్కరించిన శంకరుండు,
నిత్యదానవ్రతనియతిచే నీఘనుం
డవనికి దిగినట్టి యంబుజారి, 14.

గీ. కావలయుఁగాక ధారుణిఁ గల నృపాల
వితతిలోపల నెందైన నితనిఁ బోలు
నవనిపాలునిఁ గంటిమే, యనఘులార !
విష్ణు నంశంబు నిక్కమై వెలసె నిందు.

[శృంగి వసిష్ఠ నారదులు కొలువుకూటము ప్రవేశింతురు.

రుక్మాంగ.—[సాంజలియై యెదుర్కొని.]

[ఉత్సాహ.]

తాపసేంద్రులార యిదిగో దాసుఁడన్ భజింతు నే
నేపు మీఁరుభక్తి నిల్పి హృత్సరోంబుజంబునన్
మీ పదాంబుజద్వయం బమేయపుణ్యదంబు; నా
పాపసంచయంబు లెల్లఁ బాపి నన్నుఁ గావరే. 15.

శృంగియు వసిష్ఠుండును.—[ఏకగ్రీవముగా]

చ. గురుతరభోగభాగ్యములు గొల్లలుగా సమకూర్చి నిన్నుఁ దా
నిరతముఁ గంటిరెప్పవలె నేర్పునఁ బ్రోచుచు నెంతయుం గృపా
భరితకటాక్షవీక్షలప్రభావమునం దొలఁగించి కష్టముల్,
నిరుపమలీల నీశ్వరుఁ డనేకవిధంబులఁ బ్రోదిసేయుతన్. 16.

మ్రొక్కితివిగాన దీవించితిమెగాని,

క. ధనదునకుఁ గాసు దానం
బొనరించుట నీకు వరము లొసఁగుట మముబోం
ట్లనుపమకృపతో సాక్షా
ద్వనజాక్షుఁడె యిచ్చు నీకు వరముల నెల్లన్. 17.

రుక్మాంగ.—

ఉ. భూరి తపోధనాధికులు, పుణ్యచరిత్రులు, సర్వలోకసం
చారులు, నైనమీర, లిటు స్వాంతమునం గృప దాల్చి, మామకా
గారముఁ జేర వచ్చుటను గాంచితి ధన్యతఁ; బండెఁ గోరికల్;
ఘోర మదీయ దుశ్చరితకోటి నశించె, నిజంబు, నేఁటితోన్. 18.

తపోధనులార! మీరు మువ్వురును నొక్కసారిగ నాకు దర్శన మిచ్చుటంజేసి యా ముమ్మూర్తుల దర్శనంబు లభించినట్లు సంతసించితి. మీకును మీ యాప్తమిత్త్రజనమ్ములకును కుశలముగదా?

నారదుఁడు.—మాకును మావారలకును సౌఖ్యంబె. నీవును పుత్త్రకళత్త్రాదిబాంధవవర్గమ్మును బరిజనంబులును సుఖులై యుందురుగదా?

రుక్మాంగ.—మహానుభావులార! వేఱె యడుగనేల? పరమపావనులగు మీరు మువ్వురును నస్మత్సదనంబునకు విచ్చేయుటయే పరమకృపాళుండగు నాసర్వేశ్వరుండు నాయెడఁ దయ గలిగి నాకు సకలశుభమ్ములు నే కూర్చుచుండుటకుఁ దార్కాణము. నన్నుఁ గృతార్థునిఁ జేయు నిచ్చకంటె మీ రాకకు వేఱొండు కారణం బున్నయెడల నెఱింగింపుఁడు.

శృంగి.—రాజేంద్రా! చిరకాలమునుండి నీసుగుణసంపత్తి వేనోళ్ల వినుచుండి నిన్నుఁ జూడవలయు ననునిచ్చచే వసిష్ఠులవారిని వేఁడుకొని పయనముచేసి యామహానుభావుని వెంట నిచ్చటికి వచ్చి నిన్ను జూడఁగంటిని.

క. హరిచరణయుగళసేవా
పరతంత్రుఁడ వైననిన్నుఁ బావనశీలున్
దురితలవరహితుఁ గనుఁగొనఁ
బరమానందంబు గలిగెఁ బార్థివ తిలకా! 19.

నారదుఁడు.—రాజోత్తమా! శ్రీమదఖిలాండకోటిబ్రహ్మాండనాయకుం డగు నా సర్వేశ్వరునిఁ గీర్తించుటయు మీబోఁటి సజ్జనులను జూచు వేడ్క మల్లోకముల సంచరించుటయేకదా నాపని.

రుక్మాంగ.—మహానుభావులార! మీ వాత్సల్యమునకు మితి యెక్కడిది? అప్రార్థితంబుగఁ దమరు దర్శనంబు ప్రసాదించితిరి. సంసారపంకమగ్నుండనై భవసాగర తరణోపాయంబు తెలిసికొననేరక తల్లడిల్లు నీపామరునకుఁ దరించుమార్గ ముపదేశింపుఁడు. నానాఁటికి నా కీరాజ్యభోగములందును సంసార సుఖములందును విముఖత్వ మేర్పడుచున్నది; వీనిని మరగుట యనర్థకంబుగదా.

చ. అనఘచరిత్రులార, సముదంచిత కాంచనరత్నభూషలన్,
ఘనతరభర్మహర్మ్యముల, గంధగజేంద్రతురంగయూథమున్,
ధనమును,ధాన్యమున్,మఱియుఁ దారసుతాదులఁ,గాంచి భ్రాంతుఁడై
మనుజుఁడు, దుఃఖసాగరనిమగ్నుఁడగుం, బరలోక దూరుఁడై. 20.

బ్రతికియున్నంతకాలము దేహధారి 'ఇది నాబిడ్డ, ఇది నాభార్య, వీరు నా సేవకులు, ఇవి నా మేడలు, ఇవి నామిద్దెలు,' అని మురియుచుండును. ఉసురులు బైట వచ్చినపిదపఁ దన కెవ్వ రుండరనుమాట నమ్మఁ జాలఁడు.

చ. వలతురు ప్రాణ ముండఁగను వత్తురు వోదురు సర్వసేవలున్
సలుపుదు రాలుబిడ్డలును సర్వసుహృజ్జన బంధుకోటియుం,
దొలఁగి చనంగఁ బ్రాణములు, తోడనె భీతిలి దవ్వుదవ్వులన్
నిలుతురుగాక, చేరువను నిల్వరు, మోహ మ దేడఁ బోవునో! 21.

క. కలిగినయప్పుడు భృత్యులు
తలిదండ్రులు మీరె మీరె దైవ మటంచుం,
బలువితముల సేవింతురు,
కలిమి నశింప మొగ మైనఁ గనిపింతురొకో! 22.

అనుదినమును గనుఁగొనుచున్న యీప్రవర్తనము తనవిషయమున మాత్రము నమ్మఁ జాలఁడు.

గీ. కమ్మని సుగంధమునఁ జేసి కరము బ్రమసి
త్రావుకోరిక దుమికి ఘృతమ్ములోన

వెడలనేరని మక్షికవిధిని నరుఁడు,
చిక్కి సంసారవనధి గట్టెక్కలేఁడు. 23.

సీ. పాతకంబులకెల్ల పాదైనసంసార
మునఁ జిక్కి, కామంబు మోహ లోభ
ములు మత్సర క్రోధములు మదం బను శత్రు
పటలంబుచేతను బద్ధుఁ డగుచు,
మీఁ దెఱుంగఁగలేక మిథ్యాప్రపంచంబు
శాశ్వతం బని మదిఁ జక్కనమ్మి,
యింద్రియమ్ముల నిగ్రహింపంగ నేరక
సకల దుర్విషయసంసక్తుఁ డగుచు,

గీ. నసువు లుండంగ దుఃఖరోగార్తుఁ డగుచుఁ
జాలఁ గృశియించి కుంది పంచత్వ మొంది
యమపురంబున శిక్షల ననుభవించు
నరుఁడు, మోక్షమ్ముఁ గాంచుట యరుదు గరము. 24.

ఈ జ్ఞాన మెట్టులో సాంసారికవ్యాపారలగ్నమానసుం డగు పురుషునకు నశించును. ఈ విషయము లన్నియును విస్మృతిపా లగును. మీయట్టి మహనీయుల సేవలేకున్న మోహాంధకార మెట్లు విరియును?

ఉ. కన్నులఁ గప్పు గాఢ మగుగర్వము, జ్ఞానవిహీనుఁడై మదిం
జిన్నలఁ బెద్దలం దెలియనేరక, నా కెన లేరు ధాత్రి నం
చెన్నుచు, నీతిమాలి చరియించుచు నుండెడు నీచమానవుం,
డెన్నఁటికైనఁ గాని తరియించునె కాంచునె మోక్షసౌఖ్యముల్? 25.

వసిష్ఠుఁడు.—రాజచంద్రా! పలుకుపలుకున నెఱుక యొలుకుచున్న నీ సంభాషణము మా వీనులకు విందుసేయుచున్నది.

క. జలపూర్ణసరసియందును
జలజమ్ముపైఁ దేలుసరణి, సంసారాబ్ధిం

దల మునుఁగకున్న వాఁడవు,
దలమే వర్ణింప నిన్నుఁ దత్త్వజ్ఞనిధీ. 26.

శృంగి.— అట్లే కదా జ్ఞానసంపన్నులు సంసారమున నున్న నేమి, నిర్జనవనములం దున్న నేమి? నిజమారయ నీ నృపాలునివలె గృహస్థాశ్రమమె యవలంబించి తత్త్వజ్ఞానము నశింపనీయక నిర్మలాంతఃకరణుండై, యరిషడ్వర్గమును జయించి యాపరమేశ్వరుని నారాధించు సజ్జనుఁడే ధీరుఁడు.

ఉ. ధీరుఁడు భీతి చెందక, యుదీర్ణదృఢత్వముతో వహించి సం
సారము, దానిమోసములసందునఁ జిక్కక, తామరాకుపై
నీరమువోలె నంటకయ నిల్చి, సమస్త మనోవికారముల్
దూరము చేసి, విష్ణుపదతోయజసేవఁ దరించు భూవరా. 27.

నారదుఁడు.—సజ్జన శిరోమణీ!

చ. జనపదపత్తనంబు లఘుసంతతి కిల్లని, మేను నెవ్వని
ర్జనవనవాటులం దపము సల్పియు, శాంతిని బొందలేక, నె
మ్మనము దహింపఁ గ్రోధశిఖి, మాటికి శాపము లిచ్చుచుం దపో
ధనుల మటంచు నిక్కెడుతాపసు లందఱు నీకు సాటియే? 28.

రుక్మాంగ.—పుణ్యపురుషులార! సంసారమగ్నుఁడైన పురుషుఁడు భవాదృశులగుమహనీయుల ప్రబోధనంబునను విపత్పరంపరాపరితప్తమానసుం డగుటను నొకప్పుడు విజ్ఞానదీపకళికానిరస్తమోహాంధకారుండై యొప్పినను మఱల మాయాతమోవృతుండయి, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్య ప్రేరితుండయి, మిథ్యానందసంసక్తమానసుండై చెడును. మఱియు రాజ్యభోగంబులుగూడ గలిగినఁ జెప్ప నేల? రాజ్యలక్ష్మీలోలు రగువారికి మోక్షలక్ష్మి పరాఙ్ముఖిగాక యభిముఖి యగునె? నా కొక్కసందియంబు గలదు. మీ బోధచే నది తీర్చుకొనఁగోరెద.

వసిష్ఠుఁడు.—రాజేంద్రా! తంగెటిజుంటివలె మహాతత్త్వజ్ఞానసంపన్నుం డగు నారదమహాముని లభించియుండ మనకు సందియములు దొలంగు టెంతభాగ్యము?

శృంగి.—చతుస్సాగరమేఖలావృతమహీమండలాధిపుం డయ్యును కేవలైహికభోగపరాయణమానసుండుగాక పరమార్థచింతనాపరుం డగు నీ సజ్జనశిరోమణి చేయు శంక దీర్ప నారదుఁడుగాక మరియెవ్వరు సమర్థులు?

నారదుఁడు.—[స్వగతము] మంచియుక్తిశాలురే వీరు. తా మిరువురును దప్పించు

కొని నాపైఁ బెట్టుచున్నారు. [ప్రకాశము] నృపాలాగ్రణీ! నీ శంక వివరింపుము. నాకేమైన సమాధానము తోఁచెనేని వాక్రుచ్చెద. నాకుఁ దోఁపకున్న వసిష్ఠమహర్షులవారున్నారు.

రుక్మాంగ.—అనఘులార నాశంక నవధరింపుఁడు.

సీ. అరయంగ జీవాత్మ పరమాత్ములకు నెందు
భేదంబు లేదండ్రు వేదవిదులు;
నిష్కళంకంబును నిర్గుణంబును నైన
పరమాత్మబింబమై పరఁగు జీవ
తత్త్వమ్మునకు నెట్లు దారుణకామాది
షడ్వర్గకలుషంబు సంభవించె?
తద్విమోచన మేవిధంబునఁ బ్రాపించు?
జీవాత్మ పరమాత్మఁ జెందు టెట్లు?
గీ. అనఘచారిత్రులార దయాంతరంగు
లగుచు వివరింపుఁ డీ రహస్యంబు నాకుఁ;
దావకానుగ్రహంబునఁ దత్త్వ మరసి
ముక్తిఁ గాంచెద భవబంధములఁ దొలంగి. 29.

శృంగి.—ఈవిషయముం గూర్చి నారదమహర్షివలన నేనును దెలిసికొనవలసియే యున్నది.

నారదుఁడు.—[ఆలోచించి] ఈ ప్రశ్నమునకు నా నేర్చుకొలఁది నుత్తరము సెప్పెద. తప్పు లున్న వసిష్ఠమహర్షి సవరించుఁగాక.

సీ. పరమాత్మ బింబమై పరఁగు జీవాత్ముండు
ప్రకృతిబద్ధుం డయి వికృతిఁ జెంది,
పాంచభౌతికమును బంచేంద్రియము నైన
దేహంబు ప్రాపించి తెల్వి మాని,
మాయాప్రకల్పిత మమకారమును జెంది,
యరసి సౌఖ్యావాప్తి సరణు లెల్లఁ,

గామాద్యములచేతఁ గలుగుసౌఖ్యం బని
    భ్రమసి తద్వ్యాపారపరత నుండి,
గీ. భవపరంపరఁ దద్భవబాధ లొంది,
తద్విసర్జన చేసి శుద్ధత్వ మంది,
జ్ఞానసంసిద్ధి మమకారగర్వ ణంబు
సేసి, మగుడంగఁ బరమాత్మఁ జేరఁ గాంచు. 30.

వసిష్ఠుఁడు.—బ్రహ్మానందము, బ్రహ్మానందము! మహానుభావా, ఎంత చక్కఁగా తెలిపితివి!

రుక్మాంగ.—సంయమీంద్రా! అట్లయిన వ్రతములు, జపములు, తపములు, యజ్ఞములు, వేదాధ్యయనము, సద్గురుబోధ, మున్నగువాని ప్రయోజన మేమి? జీవాత్ముఁడు జన్మపరంపరఁ గామక్రోధాదులచే నానాబాధలం బడి విసిగి జ్ఞాన మొంది జితేంద్రియుం డగువఱకు శుద్ధత్వ మంది ముక్తి గాంచఁ డని వాక్రుచ్చితిరి.

నారదుఁడు.—అవును. జితేంద్రియుం డగువఱకును జీవాత్ముఁడు శుద్ధత్వ మందఁ జాలఁడు. కేవల జ్ఞానంబునఁ గాని యింద్రియవ్యాపారవిముఖత్వము గలుగదు. జ్ఞానము జీవునకు రెండువిధములఁ బ్రాప్తించుచుండును. జన్మపరంపరలందు స్వకీయానుభవమువలనఁ గలుగుచు నంతర్గతమై యుండి యుత్తరజన్మములయం దట్లే యభివృద్ధి గాంచునదియు; నితర జీవాత్ము లావిధంబుననే గడించి లోకోపకారంబుగఁ దమ జ్ఞానంబు శ్రుతిస్మృతి పురాణేతిహాసాదిరూపంబునఁ బ్రకటింప, వానిని జదివియు వినియు నీ జీవాత్ముఁడు గడించునదియు; నిట్లు జ్ఞానము రెండువిధముల గడింపంబడును. ఇట్టి జ్ఞానంబుచేతనే కామక్రోధాదికములు జయింపఁబడును. జప తపో హోమములు మున్నగునవి యా జ్ఞానమునకు సాధనములు. వీనిచేఁ జిత్తశుద్ధి సమకూరును; అందువలన చిత్తము ప్రశాంతమై యొప్పును. దానఁ గాలక్రమంబున జితేంద్రియత్వసిద్ధి యగును. దానిచే మోక్షంబు సిద్ధించును. కావున వ్రతములు, దానధర్మములు, జపహోమతపస్స్వాధ్యాయాదికములును, మోక్షదాయకములు. సంసారలంపటుల కివి ముఖ్యసాధనములు.

రుక్మాంగ.—మహానుభావులారా! మీ వాత్సల్యమున నాశంక తీఱినది. కరుణార్ద్రహృదయులై మోక్షదాయకం బగు సద్వ్రతం బొక్కటి నా కుపదేశింపుఁడు. దాని నాచరించి కృతార్థుండ నయ్యెద. గృహస్థాశ్రమమున నుండు మానవులకు వ్రతనియమాదులే మిక్కిలి సులభోపాయములై కనుపట్టుచున్నవి.

శృంగి.—రాజేంద్రా! నారదమహాముని బోధించిన వాక్యములసారమును గ్రహించి

శిబి. నీప్రేరణంబున నారదమహామునివలన రహస్యార్థములం దెలిసికొంటిమి.

నారదుఁడు.— రాజేంద్రా! వసిష్ఠమహర్షియే మీకుఁ బురోహితుండై యుండ వ్రతములలో నేవ్రతం బుత్తమమో ఒరులు చెప్ప నేల? వసిష్ఠమహర్షియే వక్కాణింపఁ గలఁడు. నేఁ బోయివచ్చెద.

రుక్మాంగ.—ఈ వాత్సల్యము దాసునియెడఁ బలుమఱు చూపుచుండఁ బ్రార్థించెద.

[అని ప్రణమిల్లును.

నారదుఁడు.—ఇష్టప్రాప్తి రస్తు. [అని దీవించి నిష్క్రమించును.

రుక్మాంగ.—[శృంగివసిష్ఠులవంకఁ దిరిగి] పుణ్యమూర్తులార! సర్వోత్కృష్ట మైన వ్రత మొక్కఁ డుపదేశించి నన్ను ధన్యునిం జేయుఁడు.

వసిష్ఠుఁడు.—రాజేంద్రా!

ఉ. శ్రీహరివాసరవ్రతము శ్రేష్ఠముసుమ్ము వ్రతంబు లన్నిటన్,
శ్రీహరి దైవతం బగుట చిత్తవికారము లెల్లఁ బాయు, నా
శ్రీహరియందె లీన మగుఁ జిత్తము; తొల్లిటి పాపకర్మసం
దోహ మడంగు, నాత్మగతపంకము వీడును దద్వ్రతంబునన్. 31.

రుక్మాంగ.—మీ యుపదేశక్రమంబున నే నావ్రత మాచరించెద. [సభవంకఁ దిరిగి] సకలమహాజనులార! మీ రందఱు నీమహనీయుల యుపదేశములు వింటిరి. మీరు నీ శ్రీహరివాసరవ్రతమును యథాక్రమంబుగ మహాభక్తితో నాచరింపవలయు నని మా కోరిక. రాజ్యమం దంతటను మాకోరికను బ్రకటింపుఁడు.

సభ్యులు.— ఏలినవారి యాజ్ఞ.

రుక్మాంగ.—[వసిష్ఠునివంకఁ దిరిగి] ఈ మహావ్రత మాచరించుక్రమము నానతీయ వలయు.

వసిష్ఠుఁడు.—

సీ. దశమినాఁ డేకప్రొద్దే తగును భుజింపంగ
నారాత్రి వేగుచు నంబుజాక్షు
గుణగణానుభవంబు గోరి తన్మహిమంబు
నాలకించుచుఁ దదేకాగ్రబుద్ధి,
బీదసాదల వ్యాధిపీడితులను బ్రీతి
దానధర్మంబులఁ దనియఁ జేసి,

హారికీర్తనంబును జరపి యేకాదశి
నిరశన నిర్నిద్ర నియతితోడ
గీ. ద్వాదశిని బంధుమిత్త్రబృందంబు తోడఁ
గలిసి భుజియించు టొప్పు; నీకరణి నీ వ్రత
తంబు సల్పినపురుషుండు దమము శమము
గలిగి విజితేంద్రియుం డయి గాంచు ముక్తి. 32.

రాజేంద్రా, ఈ వ్రతం బాచరించి యభీష్టసిద్ధిఁ గనుము. మేము పోయివచ్చెదము.

[అని మునులు నిష్క్రమింతురు.

రుక్మాంగ.—మనమును మాధ్యాహ్నికవిధికై యేఁగుదము.

[అందఱు నిష్క్రమింతురు.

ఇది ప్రథమాంకము.

# రుక్మాంగద నాటకము.

## ప్రవేశకము.

### స్థలము - సంయమనీసమీపము.

[ముప్వురు జీవాత్మలను వెంటఁబెట్టుకొని ముప్వురు యమకింకరులు ప్రవేశింతురు.]

ధూమ్రాక్షుఁడు.—ఓహో, ఏంవిపరీతాలు పుట్టుతున్నయిరా కుంభోదరా! ఇంకా యేమేమి విపరీతాలు సూడవల్సి యున్నామోగళా?

కుంభోదరుఁడు.—ఏంవిపరీతాలుపుట్టినయిరా దూమ్రాచ్చా! మాక్కూడా తెలియ నిస్తా మేముగూడా సంతోషిస్తాం.

ధూమ్రా.—ఏంవిపరీతాలా? అట్లాఅడుగు. మొట్టమొదట ఆయన్ను సూడు. తన యెంటనున్న జీవుణ్ని జూపుతున్నాడు. [తృతీయకింకరునివంకఁజూచి] సూడరా నూవు కూడా శండముగా. తర్వాత యీానసంగతి యేలాంటిదో శెప్పతాను. మీాకాశ్చర్యం అవుతుంది.

కుంభో.—[పరికించి] సూశాం. ఇక శెప్పు; మఱి ఆ యిపరీతం యేంటో.

ధూమ్రా.—ఎప్పుడూ సూడలేదురా ఈలాంటివిపరీతం.

కుంభో.—[విసిగికొనుచు] నేను శెప్పనా ఆయిపరీతం యేంటో?కొంత లెక్కవచ్చి యిలా దుమ్ముకొట్టి యెనక్కి యెల్లిపోయాడురా దూమ్రాచ్చా?

[అని కంటిలో దుమ్ముకొట్టును.

ధూమ్రా.—ఓరిటక్కరికొక్కరా! ఎంతపని శేస్తివిరా కుంభోదరా! నీవింకా వంగి యేమిటో తీసుకుంటున్నావనుకొన్నానురా. [అని కన్నులు నలుపుకొనును.

కుంభో.—(నవ్వుచు చండముఖునిం జూచి కన్నుగీటుచు) అయ్యో! ఊరికే ఆయన యిట్లా శేసియుండు నని అబినయం చేసినానే గాని నీకంట్లో దుమ్మేయాల్నని యెయ్య లేదు; కంట్లో పడ్డదా యేంటి?

ధూమ్రా.—ఓరి యాదేమి అబినయంరా? కంటినిండా పోశినావు దుమ్ము.

కుంభో.—దూమ్రాచ్చా! ఏమోలే, అబినయం చెయ్యపోయి అట్లా యేశాను. కోప గించుకోకా. నీయిపరీతం యేంటో శెప్పు. నేను అబినయంతో సూపించినట్టుగానే నీ కంట్లో దుమ్ముకొట్టి మళ్లీ యెనక్కి యెల్లిపోయినాడా ఏంటి?

ధూమ్రా.—అంతే, అల్లరిపనులకు పనికొస్తావేగాని మరెందుకూ పనికిరావురా కుంభోదరా నీవు. నూస్తే అట్లా పారిపోయేవోడికి మళ్ళే ఉన్నాడట్రా ?

చండ.—అలా నాకు కనిపించడంలేదుగాని, ఆ యిపరీతం యేంటో శెప్పు.

ధూమ్రా.— శండముగా ! ఇదివరకు మన మెందరిని పాశాలు వేసి లాగి గుంజి యిక్కడికి యీడ్చుకొని వచ్చామో చెప్పు, నూతాం.

కుంభో.—బావా ! శండముగా! రోజూకూ లనుకున్నావా యేంటి, ఎన్ని సారులు చేసిందీ లెక్కపెట్టు కోవడానికి? నీవు లెక్కెట్టుకొన్నావా ఏంటి! అన్నింటికంటా ఇదొక్కగొప్ప యిపరీతమే యిది.

ధూమ్రా.—లెక్కకు గాదురా కుంభోదరా, యిన్నాళ్లనుంచి మనము ఇదే పని శేస్తున్నా ఇట్లాంటి యిపరీతం యిదివర కెన్నడూ నూడలేదని శెప్పడానికిరా.

చండ.—ఈ శెప్పడం లక్షణ్ణం కూడా బాగానే వున్నదిగాని నీయిం తేంటో బైట పెట్టరా నూతాం దూమ్రాచ్చా.

ధూమ్రా—శండముగా అందుకే గాదురా మరి, యిదంతానూ? యిను. నేను ఈ యన్ను లాగడానికి కాలపాశం యేసేసర్కి ఒక్కయింత జరిగిందిరా.

కుంభో.—మటి నేను శెప్పనా? ఆయిం తేంటో (ధూమ్రాక్షుని సమీపించి) నీవు కాలపాశం యిలా వేసి లాగేసర్కి— [వాని మెడలో తగిలించి లాగుచును.

ధూమ్రా.—ఒరేవు కుంభోదరా! మళ్ళీ అబినయం ఆరంబం చేశావ్. సాలు సాలు. యిడు, యిడు, అబ్బబ్బా. [అని గుంజుకొనును.

చండ.—ఒరేవు కుంభోదరా నీ కబినయంపిచ్చె త్తిందా యేంటిరా?

ధూమ్రా.—శండముగా, ఈడికి పిచ్చేరా. ఈడికి పిచ్చే.

కుంభో.—[చండముఖునిమంక తిరిగి] నాకు పిచ్చిలేదు గిచ్చిలేదు గాని, నాకు మహాసంతోసంగా వుందిరా!

చండ.—ఎందుశేతరా కుంభోదరా! నీ కంత సంతోసము?

కుంభో.—ఎందుశేత నంటావా, ఇన్నాళ్లు మనం శేసేపని మనమనస్సుకే యిచారం పుట్టించేది. ఈ జీవుణ్ణి బొందిలోనుంచి లాగబోయే సర్కి,

గీ. తనకు కావలిశినవోర్ని తనకు సుట్టు
ఎట్టుకొని ఆర్ని యిడలేక కొట్టుకొంట,
యేడిచేజీవి సచ్చేటి యేల పాడు
పెనుగులాటేను, మనకి, ఆపీన్గకున్ను. 1.

చండ.—అవును,

క. వొక్కడు తన దన మంతా,
వొక్కడు తనపడుచు భార్య, వొకడు కొడుకుల్ల
మక్కువ నెడబాయగ లే
కక్కట యేడ్చేని గుండె లవిసెను నాకూ. 2.

కుంభో.—బావా! అలాటిది, ఇప్పుడో ఈజీవుడు ఈలోకానికి ఏదో పెండ్లిచే రంటానికి వెళ్లేలాగన మహాసంతోసంతో వొచ్చాడురా. నేను కాలపాశం యెయ్యగానే నారాయణ నారాయణ అన్నాడ్రా.

ధూమ్రా..—[స్వగతము] ఈపాటియింతే నేను శెప్పబోతే నన్ను శెప్పనీకుండా అడ్డంపడ్డాడు; ఈణ్ణి చెప్పనీకుండా నేను ఉడికిస్తాను. [ప్రకాశంగా] అంతా నారాయణ నారాయణ అంటారు సచ్చేయేళను. వా డనలేకపోతే చుట్టూ మూగినవో ళ్లంతా అంటారు. ఇదొక్క యింతగా? ఆయన నారాయణ నారాయణ అంటే నీవు నాలుక యెల్ల బెట్టినావు కావాల్ను.

కుంభో.—ఒరేవు, దూమ్రామాచ్చా, నీవు శెప్పలేవు, ఒక్కర్ని శెప్పనియ్యవు, యీ యింత, కొస్దాక యిను. ఈయన నారాయణ అనంగానే, కావల్సినవోళ్లంతా సుట్టూ మూగి యేడవడాని కారంబించారు. అప్పుడు వాళ్లవంక తిరిగి యిలా అన్నాడురా.

క. ఇలపింపనేల యినుడీ
కలకాలం బదుకు లేల కామకోడా
దుల దగిలి పాప మల్నా
త్ములు గా శెడనేల సావు ము త్తవు కాదా. 3.

అటా బొంది విడిచి వచ్చినాడు. నాకు హాశ్చర్యం అయిందిరా.

ధూమ్రా.—కుంబోదరా! నేను శెప్పే యింత యిను మఱి. నేను ఎల్లేతల్కి, పూజారిబెమ్మయ్య అంట వైద్యుడు. ఆయన మం దరగతీస్తున్నాడు. నేను కాలపాశం తగిలించా|నా; ఈన మూలిగాడు.

కుంభో.—ఆయన మూలిగితే నీవు నీలగలేదంట్రా.

ధూమ్రా.—చా లుండరా, మాట మంచీ లేదు చెడ్డా లేదట్రా నీకు! ఈన మూలగ్గానే, అమ్మలక్కలు సూట్టూ చేరారులే అంతకుముందే, శెప్పడానికి మఱిశానురా కుంబోదరా.

కుంభో.—ఒరేవు, నీవు యీాయన్నీ జ్ఞాపకం శేసుకొని శెప్పబోకు, ఈలోన అసలుఫంగతి మఱిశిపోతావురా దూమ్రామాచ్చా.

ధూమ్రా.—అంతా శెప్పకపోతే యేం సారస్యంరా కుంబోదరా, అక్కడ జరిగిన తమాసాలన్నీ శెప్పాల.

చండ. —[నవ్వుచు వినుచు] పోనీరా పాపము ఆణ్ణి శెప్పనీరా కుంబోదరా.

కుంభో.—బావా, సూస్తూఉండు, తమాసా, ఈలోగా అసలుసంగతి మరిశిపోతాడూ.

చండ.—కుంబోదరా ఆణ్ణి పోనిస్తూ, యెట్టిబాగులాడురా; ఆడి సోది శెప్పనీ. [ధూమ్రాక్షుని వంకతిరిగి.] చెప్పరా తర్వాత యేం జరిగిందో. అమ్మలక్కలందరూ సుట్టూ చేరి యేం చేశారో.

ధూమ్రా.—అమ్మలక్కలందరూ ఈయనకి జబ్బుగా ఉన్నదని అంతా సూడడానికి వచ్చారూ; అదివరకే వచ్చారు బంధువు లందరూ; పూజారి బెమ్మయ్య అంట ఆవూళ్లో పెద్ద వైద్యుడు; ఆయనవైద్యం, ఈయనకు ఉబ్బురోగం.

కుంభో.—నేను శెప్పలేదా బావా, యీడు శెప్పొచ్చిన సంగతి మరిశిపోయినాడు.

చండ.—పోనీలే పాపము. మళ్లీ గ్న్యాపకంశేయరా కుంబోదరా!

కుంభో.—నీవు కాలపాశంవెయ్యడం ఈన మూలగడం నీవు నీలగడం దాకా శెప్పావు. ఇగ అపైసంగతి శెప్పరా.

ధూమ్రా.—ఆ. అవును గ్న్యాపకము వచ్చింది. నేను పాశం యెయ్యగానే ఈన మూలిగాడు. అంతట అందరూ 'పూజారి బెమ్మయ్యగారూ, సూస్తా రేమయ్యా? మొగం కళ తప్పతూ ఉంది. ఏదైనా గాటైన మందు యేయవయ్యా.' అన్నారు. ఆయన 'యిప్పుడు చాలా గాటైన మందు యేసినాను. ఏలాంటిది యేశాను అనుకున్నారు. సూడండి యీగాబరా అంతా తగ్గతుంది' అన్నాడు. ఇంతలో ఈయన తిరిగీ కళ్లు తెరిచి సూశినాడు. పాపము పెండ్లాము కావల్సు రంబవంటిపిల్ల, 'నాగతి యేం శెప్పారు? నా కికదిక్కెంటి?' అని యేడ్చింది. ఈయన ఆవిడశెయ్యి పట్టుకొని యిలా శెప్పాడు.—

క. సకలశరాశరజాలం
ఒకరీతిని గాచు నంబుజోదరు నెపుడూ,
యికలత లేక బజింపుము;
సకలాబీష్టాలు నీకు సమకూరు జుమీ. 4.

ఇలాంటి యింత యెక్కడైనా సూశారా మీరు.

చండ.—నాకున్నూ ఈరోజు ఇలాంటి మగానుబావుడే దొరికాడు. నేను వేళ్ళేటప్పటికి వైద్యుడు నంబికిష్టమాశాల్లు మందు గొంతులో పోశాడు, తమలపాకుల రసం

కారం తాళుకోలేక ఈయన ఉక్కిరిబిక్కిరి అయినాడు. కాని కొంతసేపటికి తెలివితో నలుగురిని సూశినాడు. అంతట అక్కడ కూర్చున్న పెద్దమనుసులు సుట్టూ శేరి "మీరు ఏలాగైనా మారాజులే. పిల్లోళ్లే దిక్కులేని వోళ్లు ఇంకా వాళ్లకు బాగా రెక్కలు వచ్చేదాకా మీరుంటే బాగా ఉండిపోను. మీ యవహారం బాహుళ్లమైనది. నన్నూరుపుట్లు దాన్యం నిలవ వున్నది. దానిని యేమిశెయ్య మన్నారు? లక్షరూపాయిల పత్రాలు ఉన్నాయి. ఈతోడ బుట్టినోళ్ల కేమిశెప్పతారు? పిల్లల కేమిశెప్పతారు?" అన్నారు. అంతట ఈయన గొంతు సవరించుకున్నాడు. ఈ పెద్దమనుష్యులు "ఒరే అబ్బాయి కాయితము, కలం, శిరాబుడ్డి, తొరగా పట్టుకురా, ఈ తెలివి ఉండగానే ఆయన శెప్పే సంగతు లేంటో రాసిపెట్టుదాము." అన్నారు. కాని ఈయన కళ్లుతెటిచి యీలాగ శెప్పాడు.—

క. దనమేల దాన్యమ్మేలా
తనయులు మరి బార్య బందు తతి నా కేలం?
వనజోదరుసన్నిదికిం
జనువ్రాడీని నామనుసు పసాంతం బయ్యెన్. 5.

అని బొందిని యిడిశిపెట్టి వొచ్చినాడు.

ధూమ్రా.-కుంభో.—ఆహా మంచి యిపరీతాలు పుట్టుతున్నయిరా. ఈ ముగ్గురు మగానుబావుల్ని యిడిపించేస్తాడు మనరాజుగారు, మల్లీ బూలోకాని కంపడు. ఇదుగో దండనాలయింటికాడికి వచ్చాము. ఈర్ని ముగ్గురిని యాడికి తీస్కెళ్లాల్నో?

[అని నిష్క్రమింతురు.

ఇది ప్రవేశకము.

---

# రుక్మాంగదనాటకము.

## ద్వితీయాంకము.

### స్థలము. 1. యమధర్మరాజు కచ్చేరి.

[చిత్రగుప్తులు పార్శ్వమున నిలువ నుపవిష్టుఁడై యమధర్మరాజు ప్రవేశించును.]

యమ.— చిత్రగుప్తులారా! నిన్నఁ బరిశీలింపఁబడిన జీవులను ఇచ్చటికిఁ బిలిపింపుఁడు. వారికిఁ దగుజన్మములు విధించెదను.

చిత్ర.—కింకరులారా! తెండు వారిని. వారు రాజుగారి నగరికి దక్షిణపార్శ్వమునం దున్న మేడలో నున్నారు.

కింక.—ఏలినవారి యాజ్ఞ. [అని నిష్క్రమింతురు.

యమ.—చిత్రగుప్తులారా, పరీక్షాశాలయందు పరీక్షాపరికరము లన్నియు సిద్ధపఱిచితిరా?

చిత్ర.—అన్నియు సిద్ధమే. నిష్కములు పచ్చగాఁ దోమించి మెఱుఁగు పెట్టించి రాసులు పోయించినారము.

యమ.— మంచిపని చేసితిరి. సుందరాంగులను సర్వాభరణభూషితలం జేసి యుంచితిరా?

చిత్ర.—అట్లే చేసితిమి. పండెపుఁబణముతో జూదగాండ్రును సిద్ధముగా నున్నారు.

యమ.—కల్లలు కపటము లెఱుఁగక కేవలము సత్త్వగుణసంపన్నులైన ఛాందసులను బిలిపించితిరా?

చిత్ర.—ఆహా! పిలిపించితిమి.

యమ.—చిత్రగుప్తులారా! ముందు మనకింకరులు నేఁడు కొనివచ్చిన జీవాత్మలం బిలిపింపుఁడు.

చిత్ర.—కింకరులారా! వింటిరా యేలినవారి యాజ్ఞ.

కింక.—చిత్తము. [అని నిష్క్రమించి అనేక జీవులనుఁ దోడ్కొని ప్రవేశింతురు.

యమ.—[వారలం బరికించి, జనాంతికము] ఇదేమి పొరఁబాటు? ఆ మువ్వురను ముక్తులుగదా?

క. సదమలహృదయాంతర్గత
విదితమహాశాంతిజనితవిమలానందం
బుదిత మయి దోఁపఁ దేజ
స్సదనము లై మీరివదనజలజము లొప్పన్. 6.

[అనుచు నెదురేఁగి] మహాత్ములారా! మిమ్ము నీపాపాత్ములతోఁ గలిపి కొనివచ్చిన యీ కింకరులతప్పును మన్నింపుఁడు.

ముక్తులు.—[చిఱునగవుతో]

క. మా కేమి తిరస్కారము?
ప్రాకటముగ జీవు లెల్ల పరమాత్ముని య
స్తోక ప్రతిబింబాకృతు
లే కారే? యరయ భేద మెందును గలదే? 7.

యమ.—భళిభళి, మీరుగదా ముక్తులు. [ప్రకాశముగా] మహానుభావులారా! మీ రిటు రండు, వారు పాపాత్ములు.

ముక్తులు.—దండధరా! వారితోఁ గలిసియుండుటయే మాయభీష్టము. అట్లను గ్రహింపుఁడు.

యమ.—వారితోఁ జిరకాలము కలిసియుండుట యెట్లు? వారిం బరీక్షించి తగు జన్మముల నిరూపించి మఱల మర్త్యలోకమున కనిపి వేయుదును గదా? ఇంక ననేక జన్మములకు వీరికి ముక్తి.

ముక్తులు.—పాపము! మర్త్యలోకమునకా మఱల?

మ. అకటా కామము లోభముల్ మదము మోహాక్రోధమాత్సర్యముల్,
వికలప్రజ్ఞులఁ జేసి సంసృతి మహాక్లేశంబులన్ ముంప, నె
న్నికకున్ మించు భవంబు లెత్త, మగుడన్ జీవాత్ములం బంప నే
టికి? జీవాత్ముల నివ్విధంబునను దండింపంగ నేమే లగున్? 8.

మర్త్యలోకమున కనిపిన మఱలఁ గామక్రోధాదికంబులచేఁ బ్రేరితులై సంసారదుఃఖంబునం బడి మోహాంధకారమగ్నులయి చెడుదురుకదా?

క. ఏపగిది శిక్ష చేసినఁ,
బాపాత్ములమదిని నడరుఁ బశ్చాత్తాపం

బాపగిదిఁ జేసి ధర్మ
ప్రాపితులను జేయవలదె పాపాత్మకులన్ ? 9.

యమ.—ముక్తు లగువారిచిత్తము సర్వదా పరోపకారపరముగదా ?

ఒకముక్తుఁడు.—దండధరా ! వీరిం బరీక్షించి తగు నుత్తరజన్మము విధింతు నంటివి. వీరి నెట్లు పరీక్షింతువు ? వీరల కుత్తరజన్మ మెట్లు నిరూపించెదవు ?

యమ.—ఈ జీవాత్మలకు అరిషడ్వర్గ మనంబడు కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులం దెద్ది యుద్రేకంబున నుండునో పరిశీలించి త దుద్రేకం బడంప ననువగు నుత్తరజన్మంబుల దండనముగ విధింతును. ఈ జీవులు మఱల మర్త్యలోకంబున నాయాయి జన్మము లెత్తుచు మాయచే నహంకార మంది కామాది ప్రేరితంబు లగు కార్యంబులఁ బంచేంద్రియ సహితంబు లయిన దేహములతోఁ బ్రవర్తించి నానావిధము లగుదుఃఖము లనుభవించి, కామక్రోధాదులచే దుఃఖమే గాని యానందము లే దని తెలిసికొని, జన్మ పరంపరల నొక్కటొక్కటిగ విసర్జించి, జితేంద్రియులై శుద్ధాత్ములై తత్త్వ విచార పరులై సత్త్వగుణసంపన్నులై జ్ఞానంబు వడసి పరబ్రహ్మము నెఱింగి బ్రహ్మానంద భరితు లగుదురు. కావున మదీయ దండనవిధానము ముక్తిహేతువే యగును.

మఱియొకముక్తుఁడు.—మహానుభావా ! మీ పరీక్షావిధానమును దండనవిధాన మును అతిగూఢములై యున్నవి; మేము పరికింప నగు నేని మాకుఁ జూపుఁడు.

యమ.—ఆహా అట్లే కానిండు. చిత్రగుప్తులారా ! పరీక్షాగృహమ్మునకు పోవుదము.
[అందఱు పరిక్రమింతురు.

## స్థలము. 2. యమపురంబునఁ బరీక్షాశాల.

[జీవులు ప్రవేశింతురు.]

[సుందరాంగులతో సరససల్లాపము లాడుచుఁ గొందఱు జీవులును, జూదరులతోఁ గయ్యమాడుచుఁ గొందఱు జీవులును, నిష్కరాసులలోని నిష్కములు అపహరింప నుంకిం చుచుఁ గొందఱుజీవులును, ఖిన్నులయి క్రిందఁజూచుచుఁ గొందఱుజీవులును ఉందురు. యమధర్మరాజును, ముక్తులు మువ్వురును ప్రవేశించి మఱుఁగుననుండి చూచుచుందురు.]

ఒకజీవుఁడు.—సుందరాంగీ! ఏమి నీచక్కఁదనము. తటిల్లతవలెఁ గనులకు మిఱు మిట్లు గొలుపుచున్న నీ తనూలత నాశ్లేషింపఁ గనినవానిదిగదా జన్మము! ఆహా ఏమి ఆన గవు వెన్నెలధాళధళ్యము ! అయ్యారే, ఆపలువరుస సొగ సేమి ! [ఆశ్లేషించుకొరకు సమీపించి ఖిన్నుఁడై]

క. ఈసుందరాంగి నెమ్మే
నాసలు తుదముట్ట నెట్టు లాశ్లేషింతుఁ?
బాసెం గద దేహము; నా
కేసరణిం దీఱు నాయభీష్టం బింకఁ? 10.

అయ్యో ఈసుందరాంగి నాయెడ సుముఖురాలుగా నున్నది. దేహముతో నున్నప్పుడు నా కిట్టి జవ్వని యెందును గానఁబడ దయ్యె. ఈ దండధరుఁడు నాశరీరము నా కిచ్చి యీ సుందరాంగితో న న్నొకనిమిష ముండనీయఁగూడదా?

ద్వితీయుఁడు.—[పెద్ద యెలుంగుతో నఱచుచు] ఏమిటయ్యా? నీవు వేసిన పందెము తప్పు; ఆయన వేస్తినపందెము సరిగా ఉన్నది. ఈ పందెము పెట్టిన వరహాలకుప్ప ఆయన కిచ్చి వేయవయ్యా.

జూదరి.—నీకుఁ గూడా ఆట చేతవునా యేం? కాకుంటే నోరుమూసుకొని ఊరుకో, చేత నైతే రా ఆడు, నీ ఆటపప యేమిటో చూపెట్టుతా.

ద్వితీయుఁడు.—నాతో ఆడి యిదివరకు గెలిచినవా రెవ్వరూ లేరు; నీ యాట తెలివి చూస్తూనే యున్నాను. సరిగా పాచికలు పట్టుకోవడమైనా చేతకాదు.

జూదరి.—నీకు పాచికంటే యేమిటో తెలుసునా, ఎందుకు పేల్తావు. నోరుమూసుకొని యుండు.

రెండవ జూదరి.—అందరిని దబాయించి గెలుస్తూ ఉన్నావుగాని, నీమాత్రము ఆట నేనున్ను ఆడగలను. [జీవుని వంకదిరిగి] బలవంతుడ నని యీయన యిట్లా మమ్మును దబాయించుతాడు.

ద్వితీయుఁడు.—ఇలాంటి వస్తాదులను చాలామందిని మట్టుపెట్టినవాణ్ణే నేను. ఈ చవటపీనుగకు బయపడే వాణ్ణి కాను. నేను పందెము ఇప్పిస్తా చూడు.

జూదరి.—ఏదీ నా చేత పందెం డబ్బు ఇప్పించేవాడెవడో చూస్తాను. ఇదివరకు ఈ నాచెయ్యి నూరుగురిని బలిపుచ్చుకొన్నది. తిరిగీ బలికోరుతూ ఉన్నది. నన్నుకవ్వించి బతకగల వెదవ యెవ్వడు?

ద్వితీయుఁడు.—నీవు, నీగప్పాలు, నాదగ్గిర పనికిరావు; ఈలాంటి గప్పీలు నీవంటి ఆడముండలదగ్గిర నే కొట్టు.

జూదరి.—నేనా ఆడముండను నీవా? ఏదీ మగవాడవైతే పందెం వాడి కిప్పించు చూతాము.

ద్వితీయుఁడు.—ఆలాగా? కాచుకో యీ గుద్దు. నీ తాతలు తండ్రులుఅంతా వక్కసారి కనుపించుతారు.

పంచచామరము.

కన్ను మిన్ను గానలేక కండకావరంబునన్
నన్ను సాహసించె డీకొనంగ నీతఁ డొక్కఁడే
తన్నున న్మదం బడంతుఁ. దన్నఁ గాలు లే దయో!
ఎన్ని యేని జన్మములను నైత్తి వీనిఁ ద్రుంచెదన్. 11.

[అని ఖిన్నుఁడై యొదిగి నిలుచును.]

తృతీయుఁడు.—అబ్బా, ఏమరుస్తావయ్యా? నోరుమూసుకొనిపడియుండరాదూ, పెండ్లాము బిడ్డల నందరిని విడిచివచ్చి యిక్కడ పడి యేడుస్తూ యిక్కడకూడా దెబ్బలాటలు, తిట్టుకోవడాలేనా, [తనలో] ఈలాంటి మదోన్మత్తుడే మాయింటి పొరుగున నున్న భీమరాజు, అక్కలురానివాండ్లు పైగా అర్భకులు మాఅబ్బాయిలు. ఈభీమరాజు గిల్లి కజ్జా పెట్టుకొని కనపడ్డవాండ్ల నందరిని చావగొట్టుతుంటాడు. అయ్యో నాకూనలార, మీరెన్నడూ ఈభీమరాజుజోలికి పోకండి. ఇంక రెండేండ్లు నేను బ్రదికియుంటే నా పెద్దపిల్లవాడయినా కొంతమట్టుకు అక్కరకు వచ్చును.

నాలవవాఁడు.—[ఒకని నుద్దేశించి] ఓరీ పొగరుపోతా, ఎందుకురా దాన్ని యెగాదిగాచూస్తావు? అది నాప్రియురాలు. నీ కేమి తల దిమ్మెక్కినదా? నీ వెందుకే లంజా తిరిగి వాడివంక చూస్తావు? ఓసీ నిర్భాగ్యపులంజా, వాడితో నవ్వుతున్నావు. మీయిద్దరిపొగరు అణుస్తాను. ఈగుద్దు రుచి చూడు. [ఖిన్నుఁడై] అయ్యో గ్రుద్దుటకు నాకు చేతు లేవీ?

క. నే వలచు సుందరాంగిని,
దా వలచె నితండు భూరిదర్పాంధుండై,
యేవిధి నడంతు నీతనిఁ
గావర మయ్యయ్యో! విగతకాయుఁడను గదా! 12.

కానీ తిరిగీ జన్మములేదు కనుకనా. ఓరి నాలిపీనుగా, ఇప్పుడు నేను శరీరములేకున్నాను గనుక నీకింకను జీవించవలసిన భాగ్యం అబ్బింది. ఎన్ని జన్మాలకైనా నిన్ను విడిచి పెట్టను; నీ వాడినమాటలు నీనోట్లో కుక్కి మింగించుతాను జామా!

లోభాత్ముఁడు.—వీ రిద్దరు శుద్ధదౌర్భాగ్యులుగా నున్నారు. ఈముండావాండ్లు ఇంతంత డబ్బు పందెమొడ్డి జూదమాడుతున్నారు! ఎందు కిట్లా తగలపెట్టుకోవడం? ఆహా ఈవరహాల కుప్పలు కండ్లుగోరగిస్తూ ఉన్నాయి. వీటిని అక్కడ ఎవరు పోసియుందురబ్బా? వీటికి దిక్కెవ్వరున్ను కనుపించలేదు, ఈ జూదగాండ్లందరూ అందులోనుంచే

తీసుకుంటూ వున్నట్లున్నది. నేనుమాత్రం యెందుకు తీసుకోరాదు. ఎవరైనా చూస్తే తంటా యేమో? ఎవరు చూడవచ్చారు? వాండ్లు ఆమూలపరవశులై తమవళ్లే తా మెఱుగకుండా సిగ్గు బిడియం లేకుండా ఆసుందరాంగులతో సరసాలాడుతూ వున్నారు. వీండ్లకు జూదమే సర్వంగా ఉన్నది. ఎవరున్ను చూడడం లేదు. నే నొకరెండుగుప్పెళ్లు వరహాలు తీసుకొంటాను. వీటిని మనఊళ్లో కోకిలాంగిని వుంచుకొని డబ్బంతా దానికి ధారపోసి యిప్పు డెవరైనా అప్పిచ్చేవాండ్లు దొరికితే తన మాన్యాలన్ని కుదువబ్రాస్తానని తిరుగుతూ ఉన్న డబ్బిరు కృష్ణారావుపంతులకు నూటికి రెండున్నరచొప్పున వడ్డికి యిస్తాను. అవి ఆయన తిరిగీ యిచ్చేదీలేదు, మాన్యాలు విడిపించుకొనేదీ లేదు. అహాహా! ఎంత పొరపాటుపడ్డానురా. నాకు జబ్బుచేయగానే సాఖాతాదారులను అందరిని పిలిపించి బాకీలు వసూలు చేసుకున్నానుగాను. ఇప్పు డేమనుకొని యేమి సార్థకం, ఆ ముండావాండ్లు ఎగపెట్టుతారేమో, ఏమి చెయ్యను? ఎంత డబ్బు, అధమం యాభైవేలున్నదే నాపెట్టుబడి! ఈ వరహాలఱునా తీసుకొని దాచుకుంటాను. [అని నిష్కరాసులను సమీపించి ఖిన్నుఁడై], అయ్యో, వీటిని చూస్తూ గుటకలుమింగవలసిందేగాని యివి తీసుకోవడానికి నాకు చేతు లేవీ? ఈధనమంతా యిలా రాసులుపోసి కాపలావేయకుండా ఊరుకున్నారేమా అని సందేహం నాకు ఇందాకటినుంచీ ఉండనే ఉంది. ఇవి తీసుకోవడానికి మా కెవ్వరికిన్ని చేతులు లేనిసంగతి చూచాడు కాబోలు; లేకుంటే వేయనే వేసియుండును. ఇవి లేక పోతే పోయినయిగాని, నేను కష్టపడిసంపాదించిన డబ్బంతా యితరులపా లవుతుందేమోకదా, ఆ డబ్బంతా తిరిగీ వసూలు చేసుకొనేవరకు అయినా నాకు ఆయుష్యం యిచ్చాడుకాడు ఆ పాడుభగవంతుడు.

మదోన్మత్తుఁడు.—ఛీ ఛీ వీండ్లందరూ ఎక్కడో అల్లరిమూకగా నున్నారు. ఎమయ్యోవ్, బ్రాహ్మడా, ఇందాకటినుంచి చూస్తాను, ఒక్కమోస్తరుగా అరుస్తావు. ఏమిటి నీమొగమటయ్యా? ఒక్కమోస్తరుగా ఏకరువు పెట్టుతున్నావు, ఊరుకో. నీకు గొంతు నొప్పయినా లేదటయ్యా?

ఛాందసుఁడు.—అట్లా అనకయ్యా, నీవెవ్వరో కాని కండ్లుపోతాయి సుమా, వేదాలను తిరస్కరించరాదు.

మదో.—వేదాలయితే యెక్కువా యేమిటి?

ఛాంద.—ఎక్కువ గావటయ్యా.మరి, అవి దేముడి ముఖతా వచ్చినాయి కావా?

మదో.—చాలూరుకోవయ్యా, దేముడు లేడు, దయ్యమూ లేదు.

ఛాంద.—సరే సరే, దేముడే లేడన్నావ్? మంచిబుద్ధిశాలివే.

మదో.— ఉన్నా డండానికి నీవు చూచావా ఏమిటి? ఏమి తెలియనివాండ్లను మోసపుచ్చి డబ్బు కాజేయడానికి ఏర్పడ్డగ్రంధాలు ఈవేదాలు. అన్నిన్నీ నేనెరుగు

దును పోపోవయ్యా.

ఛాంద.—అయ్యో ఎంతపాపపుమాట అంటివయ్యా, అబ్బాయీ! నీ వెవరో మ్లేచ్ఛునివలె కనబడుతావు. కొంచెము అవతలికివెళ్లి నిలుచుందూ.

మదో.—మ్లేచ్ఛుణ్ణా నేను? నీవు బ్రాహ్మడవా? నేను అవతలికివెళ్లి నిలుచోవాలెనా? నేను నిన్నంటుకునే నిలుచుంటాను చూడు. ఇప్పుడు ఏమంటావు.

ఛాంద.—ఏమిటయ్యా మేము పఠించేవేదాలు మీరు వినకూడదు. కాస్త దూరంగా ఉండమంటే మీదికి వస్తావు.

మదో.—నేను వినకూడకపోవడమేమి, నేనున్నూ నీవంటివాణ్ణే, నీ యెక్కువయేమిటి, నా తక్కువయేమిటి, అయితే నీకు కల్లుతాగడం కూడావుందాయేమిటి, ఆచెంబులోది యేమటయ్యా, తెల్లగా ఆనీళ్లు?

ఛాందసులు.—కల్లుతాగడము మాకు అలవాటుందా అంటావు. మెల్లమెల్లగా ముదురుతున్నదే నీపాకం.

యమ.—[ముక్తుల నుద్దేశించి] మహాపురుషులారా! పుణ్యాత్ములారా! చూచితిరా పరీక్షావిధానము. వీరందఱును దేహాభిమానము గలవారే. ఆమూల సుందరాంగులతో సరసమాడుచున్నవాఁడు కామోన్మత్తుఁడు. అవంక జూదగానితో కయ్యమాడువాఁడు క్రోధాత్ముఁడు. ఈప్రక్కనాకన్నియంగూర్చి గ్రుద్ది దంపుట కుద్యమించినవాఁడు మాత్సర్యపీడితుఁడు. ఇటు చూడుఁడు. తావిడిచివచ్చిన భార్యను బిడ్డలను తలఁచుకొని వాపోవుచున్న యీ మోహాంధుని. ఆ ఛాందసునిఁ బీడించుచున్నవాఁడు మదోన్మత్తుఁడు. నిష్కారణముగ నేడ్చువాఁడు ... 

నిష్కారాములంగాంచి దుఃఖించువాఁడు లోభాత్ముఁడు.

ముక్తులు.— అక్కటకటా, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులన్నిఁటిఁ దుచ్ఛమైన శరీరమునే మఱలఁ గోరుచున్నారు గదా వీరలు! వీరల గతియేమి దండధరా ?

యమ.—మహానుభావులారా ! ఇఁక నాదండనవిధాన మరసితిరేని మీసందియములు తీరును. ఈజీవాత్ములు మీరు చూచినవిధంబున దేహం బాశ్రయించి కామక్రోధాదులచేఁ బ్రేరితులై ఆనంద మనుభవింపంగోరి బంచేంద్రియములమూలమునఁ దత్తద్విషయకవ్యాపారంబులం దగిలి వర్తించుచు సంసృతిక్లేశంబు లనుభవించుచు జన్మపరంపరాసముపార్జితంబైన జ్ఞానప్రభావంబున నా కామక్రోధాదులు మిథ్యానందదాయకము లనియు, దుఃఖకారణంబులనియు నెఱింగి, వాని నొక్కొక్కటిగ విసర్జించి దేహాభిమానంబు వదలి, నిశ్చలత్వంబు వడసి, సత్త్వగుణసంపన్నంబును, నిత్యానందభరితము నగు ముక్తిని గాంతురు. జీవాత్మల కివ్విధంబున ముక్తి సిద్ధింపఁ జేయుటయే నా దండనవిధానరహస్యము. ఇంక నాదండన విధానమును, వీరికి ఉత్తరజన్మంబు విధించుక్రమంబును, పరికిం

తురుగాళ. సభాసదనంబునకుఁ బోవుదము రండు.

[అందఱు పరిక్రమించి కచ్చేరీలో యథార్హముగా కూర్చుందురు, నిలుచుందురు.

స్థలము. యమపురము. కచ్చేరీ.

యమ.—చిత్రగుప్తులారా! ఇప్పుడు పరీక్షాకాలం బరికించిన జీవుల నొక్కొక్కనిఁ బిలిపింపుఁడు. [కింకరులు పోయి మోహాత్ముని దెత్తురు.

యమ.—మహానుభావులారా! ఇతనిం బరికించితిరిగదా? ఇతండు దా విడిచివచ్చిన భార్యను బిడ్డలను దలఁచుకొని యెట్లు దుఃఖించుచున్నాఁడో? ఈతఁడు తనచుట్టునున్న ధనరాసులను గంటనైనను గనుఁగొనఁడు, సుందరాంగులఁ గన్నెత్తిచూడఁడు, జూదగాండ్రతో మైత్రిసేయఁడు, ఛాందసులజోలికి పోఁడు. ఈతని యుత్తరజన్మ మెట్టిదిగా విధించెదనో సంగ్రహముగాఁ జెప్పెద నాకర్ణింపుఁడు. ఈఁత డుత్తరజన్మంబున పదుగురుబిడ్డలను బడిసి, వారిం బోషించుటకు ధనములేక, నానావిధము లగుకష్టంబు లంది, విసిగి, దారులం దాగి, బాటసారులను హింసించి, వారిధన మపహరించి, పుత్త్రకళత్రంబుల కిచ్చుచుండును. తుద కొక్కనాఁ డొక్కమహాపురుషుం డద్దారిని రాఁగా నతనిం దనచేతి దుడ్డుకఱ్ఱతోఁ గొట్టుటకు సమకట్ట, నాతండు.—“నా ధన మపహరింప నీకిచ్చగలదేని సర్వమును నీకొసంగెదను. నీ వీధనమంతయుఁ గైకొనుము. కాని ఇట్టి ఘోరపాతకంబునకేల సమకట్టితి వ” ని యడుగ; నాతఁడు —“నాపుత్త్రకళత్రాదులఁ బోషింప ధన మెందును గానక యిట్లు చేయుచున్నా న” ని బదులు చెప్పును. అంత నామహాపురుషుండు, “ఓ. అబ్బి, నీవు నీపుత్త్రకళత్రాదులం గూర్చి యీప్రకారము దారులు గొట్టుచున్నావు. నిన్ను మించిన బలశాలి నీకుఁ దటస్థుఁడై నిన్ను నొప్పించిచంపిన నీగతి యేమగును? అది యటుండనిమ్ము,నీవు చేయు పాపంబున నీపుత్త్రకళత్రాదులు ఎంత పంచుకొందురు.” అని యడుగును. అంత నతండు—“స్వామీ! నాకంటె బలవంతుఁడు తటస్థపడిన నాగతి యేమగునో తెలిసియే యున్నది. ఇట్టి నేను జేయుచున్న పాపమం దెంతభాగము నాభార్య, బిడ్డలు, పంచుకొందురో దానిని విచారింపలేదు. ఇప్పుడే యింటికిఁ బోయి వారలనడిగి తెలిసికొని వచ్చెద న” ని చెప్పి యింటికిఁ బోయి పుత్త్రకళత్రాదులం బిలిచి— “నేనింతకాలము రాత్రియనక, పగలనక, యెండయనక, వానయనక, ఘోరమృగములతోఁగూడిన యడవింజేరి బాటసారులం గొట్టుచు, నొకప్పుడు వారిచే మిక్కిలి నొప్పింపఁబడుచు, దొరకినమట్టునకు ధనమంతయు మీ కిచ్చుచుంటినిగదా? మీరీపాపంబున నెంత పంచుకొందురో చెప్పుఁడ” ని యడుగును. అంత వారు కరం బలిగి—“చాలు, చాలు, ధనమార్జింపలేకుండియు సంసారము నెత్తిని గట్టుకొన్న నీవే నీపాప మనుభవింపవలయుఁగాని మే మేల పంచికొనియెద” మందురు. అంత నీతండు విభ్రాంతుఁడై “నేనెంత వెఱ్ఱిని. నాధనమంతయుఁ గైకొనుచు తద్ధనార్జనమునకై నేనుజేసినపాపంబులో నొకవీసమైనఁ బంచు

కొనవొల్లని వీరికై యిట్టి ముష్కుల పాలయి పాపముల కొడిగట్టి ధన మార్జించుట, చాలు చాలు, నే నామహానుభావునిం బ్రార్థించి యీసంసారమోహ మడంగుమార్గ మరసెదం గాక” అని యోజించుచు మఱలి వచ్చి యామహాత్ముని పాదంబులం బడి—“అయ్యా, నాకీ సంసార మక్కఱలేదు. ఈ పాతకమంతయు నశించుమంత్ర మొక్కటి యుపదేశింపుఁడు.” అని వేఁడుకొని యామహానుభావుని యుపదేశంబున భగవన్నామసంకీర్తనంబు సేయుచుఁ గడతేరఁ గలండు. ఇట్లుండు నీతనికి విధించిన యుత్తరజన్మము.

ముక్తులు.— దండధరా! మీ దండన విధానము మిక్కిలి యద్భుతావహమై యున్నది. ఆ కాముకుల కెట్టిజన్మము విధించెదరు?

యమ.—చిత్రగుప్తులారా! మీరు ఆ కాముకులలో నొక్కని తెప్పింపుఁడు.

[కింకరులుపోయి కాముకుని తెత్తురు.

యమ.—మహానుభావులారా! ఇతనిం జూచితిరిగదా. ఇతఁడు ధనరాసులఁ గన్నెత్తి చూడఁడు. జూదగాండ్రతో మైత్రిసేయఁడు. ఛాందసులకు నమస్కరింపఁడు. ఈతఁడు కేవల కాముకుఁడు. ఇతనికి విధించు నుత్తరజన్మమును సంగ్రహముగా వివరించెద వినుండు. ఈతఁడు త్రిలింగదేశమున నొక సంపన్నునికి జనించును. ఇతని కొక్కసోదరుఁ డుండును. ఇతఁ డఖండ విద్యావంతుఁ డగును. ఇతనితండ్రి విశేషముగా ధనమార్జించి వీరికిచ్చి కాలధర్మమొందును. ఇతఁడు తనసోదరునియెడను తనసోదరునిభార్యయెడను వినయవిధేయుఁడై ప్రవర్తించును. ఇతఁ డొక్క వేశ్యాంగనం గాంచి దానియం దనురక్తుఁడై పిత్రార్జితంబైన ధనమంతయు దాని కిచ్చును. అంతట దారిద్ర్యపీడితుఁడై యా వేశ్యకు నొసంగ ధనమెందును గానక కూలినాలిచేసి గడించిన కాసువీసములు దాని కిచ్చుచుండును. కొంతకాలమున కితనికి వ్యాధిపుట్టి యాకూలినాలిచేయు దార్ఢ్యము నుడిగి క్షీణించును. ఆవేశ్య కిచ్చుట కేమియుఁ జేత లేకపోవును. అయ్యది తనకొక్కబంగరుమొలనూలు తెచ్చియిమ్మని పీడింపఁ దొడఁగును. ఆపీడ పడలేక అవేశ్యయింటికి వెళ్లుటమాని దానినిఁ జూడమికి మిగుల దుఃఖించుచునుండ సోదరునిభార్య యితని దురవస్థను గాంచి—“కుమారుఁడా, ఏల యిట్లు విచారగ్రస్తుఁడవై నానాట క్షీణించుచున్నవాఁడవు? నేను నీ అగ్రజునిభార్యనగుటం జేసి నీకుఁ దల్లివంటిదానను. నీకుఁ దల్లిలేదుగావున నేను నిన్నును దల్లివలెఁ గాపాడవలయు. నీ కిట్టి ఖేదమున కేమికారణము?” అని యడుగును. అంత నాతం డావేశ్యం జూడమిచేఁ గలిగిన దుఃఖము పట్టలేక—“అమ్మా, మాతృసమానవు గనుక నీతోఁ జెప్పెదను. మాయన్నగారికిఁ దెలియనీయకుము. నేనొక్కవేశ్యయందు మనంబు నిలిపితిని. ఆవేశ్య బంగారుమొలనూలు తెమ్మని నన్ను పీడించుచున్నది. ఆ నగఁ జేయించుటకు ధనమెందును గానక మిక్కిలి పరితపించువాఁడ. ఆ నగ నియ్యక యా వేశ్య నన్నింటికి రానియ్యదు. రానిచ్చినను సుముఖురాలై యుండదు. దానింజూడక నేను ప్రాణముల నిల్ప

నూప" అని చెప్పెను. అంత నాసాధ్వీమణి "అయ్యో నాయనా, నీ కింతవంత యేల? నీవు నానాట క్షీణించుటం గాంచిన మీయన్న గారికిని నాకును మిగుల వ్యసనము గలుగుచున్నది. నాకు వివాహకాలమందు మీ తండ్రిగా రిచ్చిన సొమ్ములన్నీ యున్నది. దానిం గైకొని నీ యభీష్ట మీడేర్చుకొనుము; నిద్రాహారముల వర్జించి యిట్లు కృశింపకుము. కాని నేఁ జెప్పు సమయమున నీ నగ దానికడకుఁ గొనిపోయి యిమ్ము. అని చెప్పెను. అంత నీతండు ప్రముదితస్వాంతుఁడై యా నగను గైకొని సాయంకాల మాఱుగంటలవేళ నా వేశ్యాంగనయింటి కేఁగును. అచ్చటి కతఁ డరుదెంచునప్పు డది వేఱొక సరసునితో సరససల్లాపము లాడుచుండును. అంత నీతండు విస్మితుఁడై యీ త్రాగుఁబోతుతోఁ జెలిమి సెఱపుచున్న యీ నీచకాంతకై నేను లజ్జావిహీనుండనై యిట్లు మానము పోఁగొట్టుకొంటిని. ఛీ, ఇది తగదు. దీనివలన నేమో సౌఖ్య మందఁ గోరి యెట్టి నీచపుఁ బనులు సేసితిని." అని విరక్తుఁడై అది మొదలు నీతిశాలియై నీతిబోధకములైన యనేకశతకములు రచించుచుఁ దత్త్వవిచారపరత్వమునఁ గాలము గడుపఁ గలఁడు. ఇదియ యితని యుత్తరజన్మచరిత్ర సంగ్రహము.

ముక్తులు.—ఈ యిద్దఱకును కామమోహము లుద్వేగంబున నుండుటంజేసి వీరికి విధించిన జన్మములయందు త దుద్వేగం బడంప నగువిపత్తులు గలిగి వీరి కా బంధములు వీడె. మన మటఁ బరీక్షాశాలయందు గాంచిన చాంధసుల కెట్టిజన్మములు విధింతురు?

యమ.—అట్టివారికి కేవలము భగవద్భాగవతకైంకర్యపరత్వమును దత్త్వవిచారనిరతియు నొసంగు. సాత్త్వికగుణాభివృద్ధికరంబు లయినజన్మముల విధించెదను. వారు సత్త్వగుణాతిశయంబున రజస్తమోగుణంబులవలన విముక్తు లగుదురు. మఱియు లోకోపకారపరులై యగ్రక్షేత్రంబుల జ్ఞానబీజంబులు చల్లుచుఁ జగంబు నావరించియున్న యజ్ఞానాంధకారంబు విరియింపఁ గృషి సేయు ముక్తుల యనుగ్రహంబున నిట్టివారు వేదాంత రహస్యమ్ములం దెలిసికొని మహాజ్ఞానసంపన్ను లయి విముక్తు లగుదురు.

ముక్తులు.—మహాత్మా! మేము మర్త్యలోకమునకుఁబోయి యజ్ఞానుల నుద్ధరింప నుత్సహించుచున్న వారము. మా కెట్టి జన్మముల విధించెదరో నిరూపించి మమ్మును బంపివేయుఁడు.

యమ.— మహానుభావులారా! మీరు విముక్తులగుటంజేసి మీకు మర్త్యలోకజన్మము లేదు. కామరూపు లయి మీ యిచ్ఛ వచ్చిన విధంబున సంచరింప నగును.

ముక్తులు.—అట్టులయిన మేము సత్వరంబుగ మర్త్యలోకంబున కరిగెదము. మాకు సెలవొసంగుఁడు. [అని నిష్క్రమింతురు.

యమ.—చిత్రగుప్తులారా! ఈ మహాత్ముల సందర్శనంబున నామనం బపారమైన యద్భుతానందంబుల నోలలాడుచున్నది. ఈనాఁటికి కచ్చేరి నిలిపెదము.

[అందఱు నిష్క్రమింతురు.

ఇది ద్వితీయాంకము.

## ప్రవేశకము.

స్థలము యమపురములో నొకవీథి.

[కింకరులు ఇద్దఱు ప్రవేశింతురు.]

ప్రథముఁడు.—ఓరి! ఎక్కడికిరా వడివడిగాఁ బోతున్నావు?

ద్వితీయుఁడు.—మన యమధర్మ రాజా మహారాజాగారు ఈ దినము బ్రహ్మను గూర్చి మఱీ మఱీ తపస్సు చేస్తున్నారు.

ప్రథ.—తపస్సా, తపస్సెందుకురా!

ద్వితీ.— ఇది మనదెబ్బలాటమహామునిగారి యుపదేశము; నాటిరోజున ఆయనగారు మనపట్నానికివచ్చి మనరాజాగారి దగ్గిరికి వెళ్లినారు ఎఱుగుదువా?

[తృతీయకింకరుఁడు ప్రవేశించును.]

తృతీ.—ఏమిట్రా. ఇక్కడ ముచ్చట్లాడుతూ కూరుచున్నారు! నగరిలో ఈ రోజు ఎందరుపనివాండ్లున్నా చాలేటట్టు కనిపించలేదు.

ద్వితీ.—అంతపని యేమివచ్చిందోయి బావా.

తృతీ.—ఎన్ని గంపలపూలు, ఏమికథ. ఈరోజున యమధర్మరాజాగారు బ్రహ్మను ప్రత్యక్షంచేసుకోవడానికి ఆయనగారిని మరీ మరీ ఆరాధిస్తున్నారట. అందుకోసం ఇంత పత్త్రి ఇన్నిపూలు.

ప్రథ.— ఏమిరా యీబ్రహ్మదేముడి గందరగోళము చెప్పతూచెప్పతూ మానివేసినావు.

తృతీ.— నేను చెప్పతాను. విదిశాపురము ఆప్రాంతదేశమునుంచి వచ్చినారే ముగ్గురు జీవాత్ములు వాళ్లను మనరాజాగారు తిరిగి పంపివేసినారు కారా?

ప్రథమ ద్వితీయులు.—వాండ్లా, మహాపుణ్యాత్ములు; మన రాజాగారుకూడా వాళ్లను విశేషముగా మర్యాదచేసి పంపించినారు. వాళ్లు మనము తెచ్చినవాళ్లు కారురా.

తృతీ.—వాళ్లు కారు గాని ఆముక్తులురా ఈరాజ్యానికి వండతెచ్చినది.

ప్రథమ ద్వితీయులు.—ఏమివండ ఏమివండ?

తృతీ.—విదిశాపురమున ఒక రాజున్నాడట. ఆయనపేరు రుక్మాంగద మహారాజట. ఆయన తానుమాత్రముగాక తనదేశములోని ప్రజలందరిచేత ఏకాదశీవ్రతము చేయిస్తున్నాడట. అందువల్లనే ప్రజలు పరిశుద్ధాత్ములు అవుతున్నారట. ఇంకను ఈపోయిన ముగ్గురున్ను ఆదేశములో ప్రవేశించి వేదాంతరహస్యాలు ఉపన్యాసాలు చేసి ప్రజలనందరిని పుణ్యాత్ములను జేస్తున్నారు. ఇప్పుడాప్రాంతాలనుంచి పాపాత్ములు ఒక్కరున్ను రావడము లేదు. అందుకు రాజుగారేమిన్ని కారణం తెలియక ఆలోచిస్తుండగా ఆనారదయ్యమహామునిగారు వచ్చి యీసంగతిచెప్పి నీవు బ్రహ్మదేవుడిచేత ఆవ్రతానికి విఘ్నంచేయించకుంటే క్రమక్రమంగా ఇక్కడికివచ్చేవారేలేక యీరాజ్యము పాడుపడుతుందని చెప్పివెళ్లినారు. అందుమీద యింతపుట్టింది. త్వరగా రండి, నగరికి వెళ్లుదాము.

[అందఱు నిష్క్రమింతురు.

ఇది ప్రవేశకము.

# రుక్మాంగద నాటకము.

## తృతీయాంకము.

స్థలము. యమధర్మరాజుగారి పూజాగృహము.

[యమధర్మరాజును, ఆయనకుఁ బ్రత్యక్షమై బ్రహ్మయుఁ బ్రవేశింతురు.]

బ్రహ్మ.—

క. విన్నఁదనంబున కిరవై
యున్నది నీమోముఁదమ్మి, యుల్లాసము లే
కున్నది నీమది, యేలొకో?
గ్రన్నన నెఱిఁగింపవయ్య గమలాప్తసుతా. 13.

యమ.—సృష్టి మొదలు ఇదివఱ కెన్నఁడును గని విని యెఱుఁగని వింత యొకటి పుట్టినది. విదిశాపురప్రాంతవాసు లగుజనులు ఆబాలగోపాలము ముక్తులై స్వర్గమునకే పోవుచున్నారు. ఇట్టివింత తమకు సత్వరంబుగ నెఱిఁగించుట నాకు విధ్యుక్తమైనపని గదా. నావిన్నపము సావధానంబుగ చిత్తగింపవలయు.

చ. అనృతములాడ జంకక, యహర్నిశము న్నిజలాభమే మనం
బున గణియించి, పాడి తలపోయక, గౌరవ ముజ్జగించి, వం
చనమెయిఁ పేదసాదలధనమ్ము హరించు దురాత్ము లిప్డు దం
డనమున కొక్కరైనను గనంబడ రచ్చెరు వయ్యెఁ బద్మజా. 14.

క. అనురక్తి గలిగి మిక్కిలి
చన వొప్పఁగ మెలఁగునట్టిజంపతులకుఁ బో
రొనఁగూర్చి యెడలు సేసెడు
మనుజాధము లిపుడు రారు మత్పురమునకున్. 15.

క. కడుపునఁ బుట్టిన బిడ్డను
వడివడిఁ బైరాసఁ జేసి వార్ధక్యముచే

వడఁకెడు చీఁకున కిచ్చెడు
కడిఁది దురాత్మకులు వెదుకఁ గనఁబడ రెందున్. 16.

గీ. ఆర్తు లగువారి సమయంబు లరసి, యిదియ
వారి సర్వస్వ మపహరింపంగ సమయ,
మనుచు న ప్పిచ్చి స్థలభాండ మపహరించు
ఖలులు లే రిప్పు డరయ జగంబునందు. 17.

చ. పరసతులం గనుంగొనిన భావవికారసమాకు లాత్ములై,
విరహిత నీతిబోధు లయి, పెచ్చుపెరుంగు మదాతిరేకబం
ధుర తిమిరప్రకాండము కనుంగవఁ గ్రమ్మఁగఁ, దుచ్ఛభోగ త
త్పరతఁ జరించు దుర్మతులు దండనకై గనిపింప రొక్కరున్. 18.

మ. కలకాలంబును నొక్కతీరునను సౌఖ్యం బబ్బినం గష్టముల్
వెలుచం గల్గిన జంట వాయక మనోభీష్టంబు సంధించు స
త్కులకాంతం బెడఁబాసి యన్యసతులం గూడంగఁ గాంక్షించు దు
ష్టులు రా రిప్పుడు నాదు లోకమునకుం జోద్యంబు పద్మోద్భవా. 19.

ఉ. ఆ విదిశాధినాథుని వ్రతాంచితభూరిమహత్త్వ మెట్టిదో
పావను లౌచు భూప్రజలు పాపము లెల్లఁ దొఱంగ నిత్య పు
ణ్యావహసత్క్రియాకలన నక్షయసౌఖ్యపదంబుగాంచు వా
రేవిధి నింక నాప్రభుత యెచ్చటఁ జెల్లు సరోజసంభవా. 20.

మ. జపముల్ వేల్ములు జన్నముల్ దపములున్ సాధింపఁగాలేని యా
యపవర్గస్థితి మేదినీజను లనాయాసంబుగాఁ గాంచు వా
రిపు డీ శ్రీహరివాసరవ్రతముచే నింకేల నాలోక మీ
విపరీతస్థితి మాన్ప నొక్కవెఱవున్ వేవేగఁ జింతింపుమా! 21.

బ్రహ్మ.—సమవర్తీ, నీకేల విచారము? సకలజీవులు విముక్తు లగుటయేకదా నీపరిపాలనా పర్యవసానము. అందునకేగదా అతిగూఢమైన నీదండనవిధానము ప్రయోగించుచుంటివి.

యమ.—జనులు ముక్తులగుచున్నారనియు, నాలోకమునకు వచ్చి నాచే దండనలం బడయుట లేదనియుఁ గాదు నావిచారము. ఒక్క మహావ్రత సమాచరణంబునకే ప్రీతుఁడై యా శ్రీహరి తనభక్తుల కందఱకును ముక్తి ప్రసాదించుట యెట్లు? మాయ యెట్లడంగును? జీవాత్మలు నిర్మలములై మఱలఁ బరబ్రహ్మంబునం దంతర్భూత మగుట యెట్లు?

బ్రహ్మ.—వ్రతసమాచరణమాత్రంబుననే వీరల కెల్లరకును స్వర్గ మబ్బుచున్నదను కొంటివా? శ్రీవిదిశాపురాధీశ్వరుం డగురుక్మాంగదక్షితీశుండు మహాపుణ్యశీలుఁడు. ధర్మము నాల్గుపాదంబుల నడుపుచుఁ బరిపాలించుచున్నవాఁడు. అతని రాజ్యంబునందలి జనులు అతనిశాసనవిశేషంబున దుష్కృతంబులం దగులక యాతనియం దుపలక్షితం బయిన సత్త్వగుణావిర్భవంబుచే నాకర్షితస్వాంతులై సత్త్వగుణోపార్జనారతులై సకలకల్యాణ గుణాత్మకుం డైన శ్రీహరియే దైవతంబుగా నొప్ప శ్రీహరివాసరవ్రతం బాచరించుచుఁ గామక్రోధాదు లడంగ నిర్మలాత్ములై ముక్తు లగుచున్నారు.

యమ.—మహాత్మా! శ్రీనారద మహామునీంద్రుఁడు, వీరెల్లరు శ్రీహరివాసరవ్రత ప్రభావంబుననే స్వర్గంబు వడయుచున్నా రని చెప్పెనే.

బ్రహ్మ.—ఆవ్రతమే ప్రత్యక్షకారణము. ఆవ్రతము అంతఃకరణశుద్ధితో నాచరించు వారికి మోక్షదాయకమే యగును. విషయానుబంధముక్తులయిన పుణ్యాత్ములు సకల కళ్యాణగుణాత్మకుం డైన శ్రీహరిదైవతంబుగా నెసంగు శ్రీహరివాసరవ్రతంబు నాచరించుటచేత సకలకళ్యాణగుణావాప్తి సిద్ధించి అనంతరము ముక్తు లగుదురు. భ్రమరకీటన్యాయము నీవెఱింగినదే కదా.

యమ.—పితామహా! అట్లయినఁ గొలఁదిమాత్రకాలంబున మర్త్యలోకంబు పాపరహిత మయి యొప్పుం గదా?

బ్రహ్మ.—అట్టులే కావచ్చునుగాని, రుక్మాంగదుండు గాలధర్మంబున మర్త్యలోకంబు వదలినపిమ్మట భూప్రజలు ఇట్టులే యీవ్రతం బాసక్తిమై యాచరింతురనుట కెట్లగును? అప్పు డీవ్రతమే విస్మృతిపాలు కావచ్చును.

యమ.—మాయచే నావృతంబైన భూలోకంబున భవసాగరతరణోపాయంబైన యిట్టి వ్రతము సుప్రసిద్ధంబు గావించుట మహాకార్యముగదా?

బ్రహ్మ.—మహాకార్యమే యగును.

యమ.—పంకజాసనా! ఈవ్రతము భూలోకంబున సుప్రసిద్ధంబు గావింప నను గ్రహింపుఁడు.

బ్రహ్మ.—వేదవేదాంగములయందే విశ్వాసము పుట్టించుట గడుదుష్కరంబుగా నుండు, అట్లుండ నియమమాత్రంబైన యీవ్రతమునం దెట్లు భూప్రజలకు నిశ్చలంబైన శ్రద్ధ

పుట్టింప నగును? అయిన నిది యసాధ్యము కాదు. ఒక్కవిధంబైన నిది సంఘటిల్లు.

ఉ. ఏ యనఘాత్ముఁ డైన ధృతిహీనుఁడు గాక వినిశ్చితాత్ముఁడై
యే యిడుమల్ వొసంగినను నీవ్రతరాజ మభంగురమ్ముగా
జేయఁగఁ గల్గెనే నతని చిత్రచరిత్రము నెంచి భూప్రజల్
సేయుదురీవ్రతం బెపుడుఁ జిత్తముల న్నెలకొన్న భక్తితోఁ. 22.

ఏలయనిన, అల్పజ్ఞాను లగుభూప్రజలకు బ్రత్యక్షమే సకలధర్మంబునకుఁ బ్రమాణము.

గీ. వేదవేదాంగములు గావు వివిధ శాస్త్ర
వితతి గాదు ప్రమాణంబు; విమల చరితుఁ
డైనసజ్జనుశీలమే యగును గాదె
ప్రబల మైనప్రమాణంబు పామరులకు. 23.

కావున నీరుక్మాంగదుని చిత్తము నీ వ్రతమ్మునుండి మఱలించు కపటోపాయం బరసెద. అతండు నిశ్చలుండై యీవ్రత మాచరించిన శ్రీహరిసాన్నిధ్యంబు వడయు, శ్రీహరివాసర వ్రతమాహాత్మ్యమును సుప్రసిద్ధంబై చెలంగును.

యమ.—ఇతండు సకలసద్గుణసంపన్నుండు గావున నెట్టి యాపదలు గల్గినను నితని చిత్తము ఆ వ్రతమునుండి మఱలదు. పితామహా! ఇతనిం జిక్కులుపెట్టి నెట్టి విఘ్నములు కల్పించెదవు. శ్రీహరి కంతరంగభక్తుఁ డగునితండు చేయువ్రతంబునకు విఘ్నములు కల్పించిన శ్రీహరి యాగ్రహమునకు భాజనముల మగుదుమేమో కదా.

బ్రహ్మ.—అట్లుగాదు. శ్రీహరి చిత్తశోధనంబునకై మనము సేయుపనుల కాగ్రహింపఁడు. శ్రీహరియుఁ బరిపరివిధంబుల చిత్తశోధనంబు చేసి పాత్రులైనవారియెడనే ప్రసన్నుం డగుచుండును. కావున నెవ్విధంబున నితని వ్రతాచరణమ్మునకు విఘ్నములు ఘటింప నగునో సూక్ష్మదృష్టి నరసెదం గాక.

చ. అరసితి సూక్ష్మదృష్టి, విదిశాధిపుచిత్తము క్రోధ లోభ మ
త్సర మద మోహ వర్జితము, శార్ఙ్గిపదాంబుజ భృంగరాజమై
పరఁగెడుఁగాని గామ మనివారితమై యలయించు నాతనిన్
నిరతముఁ; దద్విమోచన వినిర్మలుఁడై యతఁ డొప్పు ముక్తుఁడై. 24.

ఉ. చక్కఁదనాలప్రోవు నెఱజాణతనంబున కాలవాల మా
నొక్కసరోజనేత్ర వెర వొప్ప సృజించెద, నీ నృపాలునిం

జిక్కులఁ బెట్టి భోగరతుఁ జేసి వ్రతంబు త్యజింపఁ జేయఁగా
నక్కమలేక్షణ న్గలిపి యంపెదఁ, జిత్తజుఁ దోడు సేసెదన్. 25.

ఈమాయవనిత యానరపాలుని వలపుల ముంచి వ్రతమ్మునకు భంగము సేయ సమకట్టును.

[సాంజలి యై మోహిని ప్రవేశించును.]

యమ.— [స్వగతము] భళి! భళీ! ఈవిధాతసృష్టికౌశలము నెట్లు వర్ణింప వచ్చును!

చ. స్మరజయగోష్ఠి వేదిక విశాలనితంబము, జంఘ లన్న నా
విరివిలుకాని కాహళులు, వీక్షణము ల్కుసుమాయుధాస్త్రముల్,
గురుకుచము ల్మనోభవుని కోటలు మ్రోవి యనంగదర్పదు
ర్భరశిఖి, యాత్మభూమయము భామిని రూ పలయింప దెవ్వనిన్? 26.

మనుష్యమాత్రుఁ డైన రుక్మాంగద భూపాలుఁడీ సుందరాంగి వలపున నిక్కి వ్రతంబు గీతంబు మానునేని అదేమి యబ్బురము! సురాసురుల మోహితులం జేయ నారాయణుండు మున్నెత్తిన మోహినీయవతార మో యనుశంకం బుట్టించుచున్నది. పితామహా, ఏమి మీ ప్రభావము! ఇట్టియనవద్య మనోహరాకృతి నెట్లు నిర్మించితివి.

బ్రహ్మ.—ధర్మరాజా! ఈబాలికామణిని నాబుద్ధిచాతుర్య మంతయు వినియోగించి నిర్మించితిని.

ఉ. వెన్నెలసారము న్మెఱుపువింతవిలాసముఁ బద్మగంధమున్
గ్రొన్ననసౌకుమార్యమును గుందనపున్నిగిఁ గూర్చి నేర్పున
న్వెన్నెదనర్చు క్రొంబసుపున న్రచియించితి దీనిమోము, మో
వి న్నెలకొల్పితి న్సుధను వింతగఁ గెంపును దీపుఁ దోఁపఁగాన్. 27.

[ఆత్మగతము].—ఆహా ఈసుందరాంగి నాకే తబ్బిబ్బు గల్పించుచున్నది; స్వోత్కర్ష దోష మందురుగదా. [ప్రకాశముగా] సమవర్తీ, నాసృష్టినైపుణ్య మీవు కొనియాడ నేల? చిరకాల మాపని చేయుచున్న నా కిది యేమి ప్రాభవము?

గీ. చేయఁ జేయఁ బనుల సిద్ధించుఁ జతురత
యెట్టిమూఢజనున కేని నిజము.
బాల్యదశను లేనిప్రతిభఁ జూపింపఁడే
ప్రాయమందుఁ బనులఁ బ్రతిజనుండు. 28.

[మోహిని సమీపించి బ్రహ్మకును, శమనునకును నమస్కరించును.

మోహిని.—తండ్రీ, పితామహా! నన్ను సృష్టించిన కారణ మేమి? నా కేమి యాజ్ఞ?

బ్రహ్మ.—కుమారీ! నీవలన నొక్క గొప్పకార్యము సమకూర్పఁ దలఁచి నిన్ను నిర్మించుటయ్యె.

క. విదిశాపురపతి రుక్మాం
గదుఁ డనుభూపాలమౌళి గలఁ డాతఁడు నా
రదుబోధఁ హరివాసర
విదితవ్రత మాచరించు విమలాత్ముం డై. 29.

ఉ. అనరపాలశేఖరుని యానతిచే నిఖిలావనీజనుల్
పూని యొనర్చి యావ్రతముఁ బుణ్యముపేర్మిని ముక్తిగాంచువా
రానరనాథు మోహవివశాత్మునిఁ జేసి వ్రతంబు మాన్చి చం
ద్రానన నేర్పుపెంపునను నాయమలోకము నుద్ధరింపవే. 30.

మోహిని.—తండ్రీ - మీయట్టిమహానుభావుని పుత్త్రిక నైననాకు నొక్కమర్త్య మాత్రునా గూర్చితిరి? నాయపరాధ మేమి?

బ్రహ్మ.—కుమారీ,

క. ఆనరపాలగ్రామణి
మానవసామాన్యుఁ డనుచు మదిఁ గొంకకు మో
మానిని; యాకృతి నాతఁడు
సూనాస్త్రుఁడు ధీవిభూతి సురగురుఁడు సుమీ. 31.

మఱియును; నామాట కియ్యకొని నీవు నేను వాక్రుచ్చినకార్యము నెఱవేర్చితివేని లోకమునకు మహోపకార మగును.

మోహిని.—నాయనా! మీమాట కెదు రాడుదునా? ఆ నరపాలుఁడు హరివాసరవ్రతపరాయణుం డని వర్ణించితిరి. చేతోవికార సంతతియకారి యైనయావ్రత మాచరించు మహానుభావుని నేను మరులుగొల్పఁ జాలుదునా?

యమ.—ఆసందియము నీకు వలదు. ఈరుక్మాంగదుఁడు నిన్నుఁ గాంచినంతనె అపారమోహసాగర మగ్నాత్ముఁ డగు ననుటకు సందేహ మే మున్నది? అచ్చర మిన్నల

కౌఁగిట నిత్యము భోగించు నాయమరేంద్రుఁ డైనను దబ్బిబ్బయి నీకటాక్ష వీక్షణంబు నకై పరితపించును.

క. సురగరుడోరగవిద్యా
ధరకిన్నరసిద్ధసాధ్యతరుణులలో సుం
దరి చక్కఁదనమ్మున నీ
సరి యగుజవ్వనులు లేరు సత్యము సుమ్మీ. 32.

మోహిని.—సర్వ మెఱింగినమీ రే యిట్లు సెలవిచ్చిన నే నేమి చెప్పఁగలదా నను? మహామేధావి యానరపాలుఁడు పామరునిచందమున శరీరసౌష్ఠవమునకే యంత మోహమగ్నుఁ డగునా?

బ్రహ్మ.—అవును. ఆనరపాలుఁడు మేధావియుఁ జతురుండు నగును.

గీ. వాలు గఱఁగంగ మోళ్లంకురముల నెత్త
వీణ వాయించి పాడంగ విపుల మైన
గానవిద్యాప్రవీణత గలుగుఁ జుమ్మి
నా యనుగ్రహమున నీకు నలిననేత్ర. 33.

నీయపూర్వసౌందర్యవిలాసంబునను నీగానవిద్యావైభవంబునను నానరపాలు మెప్పించి, వలపించి, మోహసాగరమున ముంచి, యాతనిచిత్త మపహరించి, నీకనుసన్నల మెలంగు నట్లు గావించి, వ్రతంబు మాన్పించి, మా యభీష్ట మీడేర్పుము.

మోహిని.—నాయనా! సర్వధర్మమూలమగుమీకుఁ బలుమాఱు మాటాడ నొల్లను. కాని కార్యసాధనాపరాయణత్వమున మీ కింకొక్కవిన్నపము సేయుదాన; లోకమం దెందైన నప్రార్థితంబుగ స్త్రీలు తమయంతన తాము పోయి పురుషులఁ బెండ్లాడు మని యడుగుదురా? నన్నుఁ బెండ్లాడు మని నే నాయన నెట్లు వేఁడికొందును?

యమ.—పంకజాసనా! ఈమగువ బుద్ధిసంపదఁ గాంచిన నీకార్య మె ట్లైని సమ కూర్పఁ గలదని నాకు ధైర్యము కలుగుచున్నది. మగువలు పురుషులను బెండ్లికై ప్రార్థించుట యాచారవిరుద్ధము. ఆరుక్మాంగదుఁ డే యీనెలఁతం గాంచి మోహించి పెండ్లికై ప్రార్థించునట్లు చేయు తెర వాలోచింపుము.

బ్రహ్మ.—కుమారీ! చక్కఁగ హెచ్చరిక చేసితివి. ఆరాజన్యుఁడే నీకడ కరుదెంచి నీపాణిగ్రహణం బర్థించునట్లు చేసెద. నీవు పోయి విదిశాపురప్రాంతవనంబున నుండుము.

గీ. క్రూరమృగముల నింపుడుఁ గోట్లకొలఁది
నానృపాలునిరాజ్యమ్మునందు వాని

పీడఁ బడలేక భూప్రజల్ వేఁడికొనఁగ
వచ్చు వేఁటాడ నచటికి వనిత యతఁడు. 34.

వచ్చి యాక్రూరమృగంబులఁ దునుమాడి యొక్కెడ విశ్రమింపఁ గడంగును. అట వసంతుండు నీకు సహకారి యై మెలఁగును.

ఉ. చివురుంజొంపము లొక్కచోఁ, బరిమళశ్రీతోడి సంఫుల్లపు
ష్పవితానం బొకచోటఁ, బుప్పొడులపుంజం బొక్కచో, దేవకా
లువజా లొక్కెడ, నొప్ప, గాలినిసువు ల్మోదంబుఁ గూర్పంగ, మా
ధవుఁ డెంతేఁ గయిసేయు, నావనము చేతఃప్రీతి సంధిల్లఁగాఁ. 35.

ఆ వనశృంగారమున కచ్చెరు వంది విహరించు నానృపాలునిచిత్తమును నీమృదుమధురగానంబున నాకర్షింపుము. నీమధురస్వరాలాపకాంతుఁచె నాభూపాలుఁడు నాపనుపున నీకడ కరుదెంచును. అంత,

గీ. చిలుకదొర తేజిపై నెక్కి చెఱకువింట
జమిలిముక్కులిగమినారి సవరు చేసి
పూవుములుకులు గుఱిచేసి తావు లరసి
గ్రుచ్చి యలయించు మదనుఁ డా కువలయేశు. 36.

మ. నీలావణ్యవిలాసవిభ్రమముల న్నీపాటచేఁ జొక్కి భూ
పాలగ్రామణి భూరిమోహతిమిరప్రచ్ఛన్నవిజ్ఞానుఁ డై
జాలిం దూలుచు నీకరగ్రహణ మాసన్ వేఁడు దైన్యంబున
న్బాలారత్నమ మాయభీష్ట మటుపైఁ బాటించి యీడేర్పుమా 37.

యమ.—మహానుభావా! నీకార్యసంవిధానము సమగ్రముగదా?

మోహిని.—తండ్రీ! మీ రాజ్ఞాపించినవిధంబునఁ బ్రవర్తించి నాశక్తికొలఁది నానృపాలుని వ్రతమ్మునకు విఘ్నమ్ము సేయ సమకట్టెద. నాప్రయత్నము సఫలమై యాభూపాలుఁడు వ్రతం బుజ్జగించె నేని మర్త్యలోకవాసులు నన్నేమందురు? నన్ను సజ్జను లందఱు నిరంతరము నిందింపుదురు కదా? సజ్జనసమ్మానమునకు దూరమై యచ్చట మనికి నా కెంత యసహ్యముగ నుండునో యూహింపుఁడు. నా ప్రయత్నము విఫల మైన నారాజచూడామణి నామాయలు కనిపట్టె నేని నాయెడ నాగ్రహంబు పొడమి నన్నేమిచేయునో కదా?

బ్రహ్మ.—కుమారీ, నీ కిదె వర మొసంగెదను. నీ వెపుడు సంకల్పించిన నప్పుడే నాసన్నిధిం జేరఁగలవు. ఈకార్యంబున నేది యె ట్లయినను నీ కేపాప మంట కుండును, పొమ్ము.

[మోహిని నమస్కరించును.

బ్రహ్మ.—సకలజగమునకును శుభమగుఁ గాక.

[అని దీవించును. మోహిని నిష్క్రమించును.

బ్రహ్మ.—సమవర్తీ! మనపన్నాగ మిప్పటికి సమగ్రముగ నల్లఁబడినది కదా. కాని దీనిచే వ్రతప్రశస్తియే నెక్కొనును గాని వ్రతభంగంబు గా దని దివ్యదృష్టిచే తెలుకవడుచున్నది. ఇఁకపర్యవసానమునకై నిరీక్షింపుము. నేనీ బోయి వచ్చెద.

[అని యంతర్ధాన మొందును.

యమ.—కడతేఱితిని బ్రహ్మవరమున. ప్రశస్తి నెలకొనుటయే నాకును సమ్మతము. నేనును సమయోచితకృత్యముల కేఁగెదను. [అని నిష్క్రమించును.

ఇది తృతీయాంకము.

## రుక్మాంగద నాటకము.

### చతుర్థాంకము.

స్థలము - అరణ్యము.

[బాణబాణాసనంబులతో రథస్థుఁడై రుక్మాంగదుఁడు ప్రవేశించును. వేఁటకాండ్రు అడవిలో పఱవఁదోలుదురు.]

రుక్మాం.—సారథీ, వేఁటకాండ్రందఱును బైలువెడలి వారివారి నియమితస్థలంబుల కేఁగుచున్నారు. మెకము లన్నియు నిరవునకుఁ జేరి నిద్రించు సమయమైనది. అరుణోదయ మగుచున్నది. ప్రాతఃకాల మెంత రమణీయముగా నున్నదో చూడుము.

సీ. నిద్రమ బ్బెడలంగ నెమ్మిమొత్తమ్ములు
 పురి విచ్చియాడునాపొలుపు గంటె?
శాద్వలమ్ములఁ జూచి సంతసంబున లేళ్లు
 పేరెముల్ వాఱు నావింత గంటె?
అంధత్వము దొలఁగ నలచక్రవాకమ్ము
 తన జోడు నరయు తత్తరము గంటె?
నెఱసంజకెంజాయ నీటఁ గన్గొని యుల్కు
 రాయంచకొదమ విభ్రమము గంటె?
గీ. సకలజీవప్రపంచంబు సత్త్వపూర్తి
గాంచి మేల్కాంచి యలరారెఁ గంటె మిత్ర?
యుదితతేజస్కుఁడై భానుఁ డుదయ మందెఁ
బ్రాచిరతనాలచేర్చుక్కపతక మనఁగ. 1.

గీ. మంచువలిపంపుఁబయ్యెద మఱుఁగుఁ బాపి
తమ్మిజవరాలిచనుమొగ్గ లిమ్ముగాను
గరములను జాఁపి స్పృశియింపఁ గమలహితుఁడు
గాంచి సిగ్గునఁ గనుమూసెఁ గలువకన్నె. 2.

ఉ. బారుల్ తీరి వియత్పథంబున వడిం బాఱున్ విహంగమ్ము, లిం
పారం బూచినపూవుగుత్తుల మరందాసక్తరోలంబముల్
దూఱున్, మందసమీరపోతములు గ్రాలున్, ఫుల్లనీరేజక
ల్హారస్ఫార సుగంధబంధురములై, వ్యాపించె నర్కద్యుతుల్. 3.

క. తమపతినిఁ గనుంగొను హా
ర్షముచేఁ బద్మినులకనుల స్రవియించిన బా
ష్పము లన హిమకణము లురిలె,
భ్రమరమ్ములు మూఁగఁ బద్మపత్త్రముల పయిన్. 4.

సీ. వినువాఁకపొందమ్మివిరిపుంజములకమ్మ
పుప్పొడి నెత్తావి నప్పళించి;
తెఱగంటితెఱవల యిఱుకుఁజన్గవపూఁత
కస్తురివలపులు గడన సేసి,
వేలుపుమన్నని విరితోఁట యనఁటుల
పచ్చకప్రపుఁదావి మ్రుచ్చిలించి,
చదలేటి యలలపైఁ బొదలు తుంపురుగమి
చల్లదనం బెల్ల సంగ్రహించి,

గీ. బడలికలు పూని మెల్లని నడలతోడ
మంచిగందపుగుబ్బలి మారుతములు
స్వర్గభోగంబు పుడమికి సంతరించు
పొలుపుఁ దెలుపుచు నెల్లెడఁ బొదలఁ జొచ్చె. 5.

సారథి.—రాజేంద్రా! ప్రాతఃకాలరామణీయకసమాకర్షితస్వాంతులై యింత తడవిచ్చట మసలుటయ్యె. ఇఁక నాలసింపఁ దగదు. వేఁటకాండ్రందఱు మెకమ్ములవెడలఁగొట్టి వానిం దఱుముచు నిటు వచ్చుచున్నవారు. అ వేఁటకుక్కల యాగడము తిలకింపుఁడు.

మాలినీవృత్తము.

హగహగ యని శ్వాసం బొర్చుచుం జాఁచి నాల్కల్
మృగచయముల నెల్లన్ మ్రింగ నుంకించుమాడ్కిన్,

మిగులఁ గఱకుగోళ్ల స్నేదినిం గీరుచుచు వే
పి గణము చనుదెంచెం బిల్లసింగంబులో నాఁ. 6.

కాళ్లఁగొళ్ల నుపమించుచు నడగొండలవలె దిశాంతంబులఁ జిమ్మచీఁకటులు గ్రమ్మ నీదిక్కు నకుఁ బరువిడుచున్న యా యేనుఁగుఁగుతండములం బరికింపుఁడు.

సీ. పూలతోఁ బండ్లతోఁ బొలు పొందు ఫలవృక్ష
మండలంబులఁ దమ తుండములను,
గూఁకటివేళ్లతో నీఁకమైఁ బెకలించి
తోఁటలయందమ్ము దూలఁజేసి,
సిరి మీఱు వరిచేలఁ జొరఁబడి ధాన్యంబు
మూలముట్టఁగ మేసి చాలఁ గ్రొవ్వి,
వారిజాకరముల వాసి వన్నెయుఁ బాపి
కావలివారలఁ గాళ్లఁ ద్రొక్కి,
గీ. తోల వచ్చినవారి నాభీలదంత
యుగ్మమునఁ జీల్చి వైచుచు నుగ్రభంగి
నంధకారచయంబన నాకసంబు
నంటఁ జనుదెంచెఁ జూడుము హస్తిచయము. 7.

రుక్మాం.—[సంభ్రమించుచు] సారథీ!

స్రగ్ధర.

తేరిం బోనిమ్ము వేవే ధృతిఁజెడి మృగయుల్ దీనులై రుక్మాంగన్
బారంజన సామజంబుల్ పఱచి పదహాలిం బట్టి చక్కాడ ఖద్గిన్
ఘోరార్తిం జెంది చీకాకువడి పఱచుచున్ గూయిడం జొచ్చి రారా
క్రూరోదగ్రద్విపాళిం గులిశహతిబలెం గూల్తు నారాచపంక్తిన్. 8.

[సారథి తేరిం దోలును.

రుక్మాం.—సారథీ! ఈ హస్తిచయములోఁ గొన్ని నాచేతను, గొన్ని పలాయనం బులగుచు వేఁటకాండ్రచేతను మడిసె. ఆహా; మరల నీకోలాహలం బేమి? డాపలిప్రక్కఁ జూడుము.

క. శరభము లల్లవె చూచితె
యురుజవమున జాగిలంబు లుఱుకఁగ వెంటన్
బరువెత్తి డాఁగు ఘన గ
హ్వరములలోఁ, జాయఁ దోలు మరదంబు వడిన్. 9.

సారథి.—డాసితిమి రాజేంద్రా! రథమునందడి కులికి శరభసమితి గహ్వరము వెల్వడి కుప్పిగంతు లేయుచుఁ బాఱుచున్నది. సత్వరమ్ముగ నీయమ్ములపాలు సేయుము.

రుక్మాం.—సెబాసు, సారథీ! నీ సారథ్య కౌశలము ప్రశంసనీయము గదా? కడు దవ్వై యతిరయంబునం బాఱు నీ శరభమ్ముల లిప్తమాత్రకాలంబున డాయఁదోలితివి.
[శరవృష్టి గురియును.

సారథి.—రాజేంద్రా! ఈ దిక్కున నీ కోలాహలముం గంటిరా?

రుక్మాం.—పులివేఁటకాండ్రు, భళి భళీ.

మ. మృగయుం డొక్కఁ డమేయసాహసముపేర్మిం జేరఁగాఁబోయి బల్
తెగువ న్నారన మొక్కఁ జేయఁ బులిపైఁ, దీప్తక్రుధాశోణ దృ
గ్యుగమై యద్దియు వానిపై నుఱికె, వాఁ డుద్యద్ధృతిస్ఫూర్తిమై
బిగువుంగౌఁగిటఁ బట్టి దాని విసరెన్, విభ్రాంతులై రందఱున్. 10.

సారథీ! వాఁడుగదా వీరుఁడు?

సారథి.—రాజేంద్రా! తమ రెప్పుడును గుణైకప్రపక్షులే. ఈ మూలఁ బరికింపుఁడు.

గీ. ఉక్కుమీఱిన వేఁటకాండ్రురులఁ బన్ని
తఱుమ నెన్నంటి ఖానిలోఁ దవులుకొనియు
బలము మైఁ ద్రెంచి వెల్వడి చలువపిడుగు
భంగి పాఱెడునొంటరిపందిఁ గంటె. 11.

రుక్మాం.—అతిఘోర మతిఘోరము. దారి కడ్డమై వచ్చి తన్నాఁపిన వేఁటకుక్కలఁ దన కోఱలకు బలిపెట్టుచుఁ బీఁటపెట్టుకొని చేరవచ్చినవారిపై నుఱుకఁబోవుచున్నది. అదిగో శౌనకం గదా వేఁటకానిని. ఱుఱుల లేమచున్నాఁడు. నెత్తురు గాఱుచున్నది. పడిపోయెంగదా వేఁటకాఁడు. ఈ శాశరఁబు దీని ప్రాణవాయువులం గ్రోలుఁగాక.
[బాణము వదలును.

సారథి.—కూర్మాగ్రేసరా! విలువిద్దెలో తమకంటెఁ బండితులు లేరు గదా? కంటికగపడక వాయువేగంబునం బాఱు వరాహమ్ము నొక్కశరమ్మునం గూల్చితిరి.

రుక్మాం.—సారథీ! ఈ వంక నీ బొద మటుంబున నున్న యా లేడిని చూడుము. దానిం గాంచిన నామనము కరఁగిపోవుచున్నది.

ఉ. కూనలఁ బాయనేరమిని ఘోరమదీయ కఠోర కార్ముక
జ్యానినదంబు దా వినియు నవ్వల నివ్వల సంభ్రమించుచు
న్నానలుగా స్రవింపఁగఁ గనుంగవ నశ్రులు పాఱకున్న దెం
తేని భయుంబునన్ హరిణి. యెక్కుడె బిడ్డలకంటెఁ బ్రాణముల్? 12.

ఆఁడుదానిమనం బతికోమలంబు గదా? బిడ్డలమీఁది కూర్మి యెంతఘనము; ఈ దెసఁ జూడుము.

ఉ. నాదు ధనుర్వినాదము వినంబడినంతనె కర్ణయుగ్మముల్
మీఁదికి నిక్క సంభ్రమము నేత్రములం దులకింప, భూమిఁ గా
లూఁదక కొంతదూరము రయోద్ధతిఁ బాఱుచు నిల్చుచు న్దెసల్
మేదురభీతిఁ గన్గొనుచు లేటిమగల్ పరువెత్తెడుం జుమీ. 13.

సారథి.—భూపాలతిలకా! నిరపాయకరంబులైన సవు మేసి యడవుల సంచరించు నీ మృగములయెడ దయార్ద్రహృదయు లగుట తమకు సహజమే కదా?

చ. మదవదరిప్రకాండపరిమర్దనదక్షభుజప్రకాండ, మీ
హృదయము దుష్టులం దిటులనే కఠినంబును సాధుకోటిపై
సదయము నౌట యొప్పగును, జక్రహితంబును రాత్రిచారికిన్
మదపరిభంజనమ్మును నొనర్చు నహఃపతియింటఁ బుట్టుటన్. 14.

[నేపథ్యములో జయ జయ రావంబులు]

రుక్మాం.—విని, సారథీ! ఎండ యెక్కినది. క్రూరమృగంబు లన్నియు సమసె. కేటకాంద్రు మహోత్సాహంబునఁ జేరవచ్చుచున్నారు. వీరలం దగురీతిని బహూకరింప నగు.

[బోయలు చేరవచ్చి నమస్కరింతురు.

రుక్మాం.—బోయలారా! మీరు మాకు కరము మృగయావినోదంబు ఘటించితిరి. మీ తెగువకును నేర్పునకును మిక్కిలి సంతసించితిమి. క్రూరమృగంబుల నిర్మూలముచేసితిరా; సాధుమృగము లెవ్వియు హింసపడలేదు గదా?

బోయలు.— మారాజా! తమ వుత్తరవు లేక మేం మొక్కపనిచేస్తామా మాప్పెబో! లేళ్లు కుందేళ్లు జింకలు దుప్పులు చాలా ఉన్నాయి. వాటిమీద మేము దెబ్బేస్తే మీపాదాలయాన.

రుక్మాం.—బోయలారా! మీ రింక వేటచాలించి కొంతవడి బడలికతీర్చుకొని మీ నెలవులకుఁ బొండు. మేమును జల్లప్రొద్దునఁ బురమ్మున కరుదెంతుము. సారథీ! వీర లకుఁ దగు బహుమతు లిచ్చి యంపివేయుము.

[సారథి కొన్ని నిష్కములు తీసి యిచ్చును.

బోయలు.— [అపవారించి] వహవ్వా, వహవ్వా, ఏం మహరాజురా యీన, మనకడుపునిండా పెట్టి కాలినిండా పనిపుచ్చుకుంటాడు. [ప్రకాశము] మహారాజా! మీ నౌకర్లకు శెలవియ్యండి. తమ రెప్పుడు కాకొశేత వర్తమానం చేసితే అప్పుడు శేతులుకట్టు కొని పాదాలకాడికి వస్తాము.

రుక్మాం.—మీకు మరల నేకాదశినాఁడు వర్తమాన మంపెదము. పొండు.

బోయలు.—దండం, దండం. [బోయలు నిష్క్రమింతురు.

రుక్మాం.—సారథీ! మిక్కిలి ప్రొద్దెక్కినది. వేఁడివెలుఁగు వాఁడిమిం జూపుచు న్నాఁడు. లతకూనలు వాడి వత్తలై పోఁడిమి దఱిఁగియున్నవి. తనధాక కోడిపలాయనం బులయిన చీకఁటులకు శరణం బొసంగె నని లతానికుంజపుంజములపై నలిగి చండకరుఁడు తన వేఁడికిరణంబుల వానిని మాడ్చుచున్నవాఁడు. మన కిం దెచ్చోటనయినను గొంతవడి విశ్రమింప నమరగు నెడ మున్నదేమో చూచి రమ్ము.

సారథి.—రథము నిల్పి పరిక్రమించి మఱలి వచ్చి.

సీ. పరిపక్వ పనసాది ఫలనిర్గళ చ్చారు
మధురస నిర్ఝర మండితంబు,
సద్యోవికస్వర చాంపేయవకుళాది
సుమనోరజోవేది శోభితంబు,
మకరంద పరవశోన్మత్తమధువ్రత
వ్రాత సంగీత విభ్రాజితంబు,
పద్మరాగారుణ పల్లవనికురంబ
దివ్యరసాలసందీపితంబు,
గీ. తటవివర్ధిత గోస్తనీవటల కుంజ
నిస్సరత్క్షౌద్రమిశ్ర వినిర్మలాంబు
పూర కాసారవాపికా భూషితంబు,
దనరు నచ్చోట నొక్క యుద్యానవనము. 15.

రుక్మాం.—[సారథి త్రోవఁ జూపఁ బరిక్రమించుచు] ఆహా ఏమి యీ వనము శృంగారము?

ఉ. సారము లేని యన్యవనసంచయము ల్దగ నంచు రోసి యిం
పారెడి యీవనంబున ననారతము న్వసియించుఁ బ్రీతిమైఁ
జారువసేందిరారమణి చైత్రునిఁ గూడి మరంద సారణీ
తీరములం బరాగములతిన్నెలఁ బుష్పలతాగృహంబులన్. 16.

శా. కృతకక్ష్మాధరమట్లు స్వైరవిహృతిక్రీడార్హ మై కించి దు
న్నతశృంగంబుల నొప్పు భూధరముపొంతం బొల్చు కాసార మం
చిత చక్రాహ్వయ కేళికాచలితరాజీవౌఘకోశాంతరో
ద్గత మాధ్వీకవిలోలభృంగ మృదుగీతం బక్షుపర్వంబుగాన్. 17.

అతి మనోహరంబయిన యిచ్చోటఁ గొంతవడి విశ్రమించి పిదప దేరి పురమ్మున కరుగుదము గాక.

[ఇద్దఱు విశ్రమింతురు.

రుక్మాం.—సారథీ! ఆలింపుము. ఇది నిర్జనవనము కాదు.

క. ఆనందకందమగుచుశి
లానీకము కరఁగ మృగచయ మ్మలరన్ వీ
ణానాదం బీదెస నా
వీనులకు నపూర్వ మైనవిందు ఘటించెన్. 18.

భళిభళి, ఎంత మనోహరముగా నున్నది యీ పాట! ఈ వనశృంగారమున కనుగుణంబగు చల్లనిపాటగదా? మన మీ దెసకేగి పాడుచున్న దెవరో చూచిన త్తము రమ్ము.

[ఇంతలో విదూషకుఁడు ప్రవేశించును.]

విదూ.—రాజేంద్రా! [చతికిలఁబడి] ఇంతవరకు మా తల్లి కడుపుచలవను బ్రదికి గండము తప్పించుకొని వచ్చి నిన్ను గలుసుకొంటిని. అబ్బబ్బా, తన్నుమించినవారితో నేస్తముచేసినంగదా వచ్చును ఇట్టిపాట్లు. [నిట్టూర్పు పుచ్చును.

రుక్మాం.—వయస్యా! నీ కీపాట్లు నా నేస్తంబుననా కలిగినవి! చెప్పుము. నీకుఁ గలిన పాట్లెట్టివో, గండ మెద్దియో? [అని చిఱునవ్వు నవ్వును.

విదూ.—గండమా? గండము కాదా మరి? ఈ కీకారణ్య బ్రహ్మారణ్యములో బడి

రావడం గండ మౌనా కాదా. ఏ పొదచాటునుంచి యే పెద్దపులి పైనబడితే ఏం దిక్కు చెప్పు ?

రుక్మాం.—గండము తప్పెను గదా. ఇఁక నీకుఁ గలిగిన కష్ట మేమి; నే నేమి చేసితిని ?

విదూ.— నా కీపాట్లన్నీ యెందుకు వచ్చినవి ? నీ స్నేహము మూలాననే.

రుక్మాం.—కానీ మఱి అవి యేవో చెప్పు.

విదూ.—మొదటిది పెద్ద కందిరీగను చూస్తేనే ఒళ్లు జలదరించే బక్క బ్రాహ్మ డికి నాకు ఈ వేట చూడవలెనన్న కోరిక. మా జాతివాండ్లతో గలిసి ప్రొద్దున్నే స్నానంచేసి విభూతి పూసుకొని పనస చెప్పుకుంటూ విస్తరాకులు తెచ్చుకోవడం గురు వులవద్ద శుశ్రూష చేయడం మాని మీసాంగత్యము చేయబట్టికదా యీ బుద్ధులు పుట్టినవి. ఈ బుద్ధి పుట్టడంబట్టి గదా పులియనక పుట్టయనక యీ యడవులలో బడి నిన్ను వెదు క్కొని రావడం.

రుక్మాం.—వయస్యా ! వేఁటఁ జూడవలయు నని నీకుఁ గోరిక కల దని నాతోఁ జెప్పియుండిన నీ కనాయాసంబుగాఁ ఆకోరిక దీర్పనా ?

విదూ.—ముందు నా గోడంతా వినవయ్యా. నీతో జెప్పివుంటే నీవు నాకోరిక తీర్చనూ తీర్చియుందువు. ఈకష్టం తెలిసియుంటే నేను రానూ రాను. ఆమాట లెందు కిప్పుడు ? ఇక రెండవది చెప్పుతాను విను. సంభావనకోసం ఆ రామడలదూరమైనా నొక్క పగలు పోగలవాణ్ణి ; ఈ దినము రవంతసేపు నడవడంలో బడలిపోతిని.

రుక్మాం.—నీ వేల నడచి వచ్చితివి ?

విదూ.—ఇది మరీ బాగున్నది. మీరు దాటివచ్చితిరి గదా. నేను నడిచిరాక మరి యేమిచేయను; పరుగెత్తి రమ్మంటావా ? ఇక మూడోది చెప్పుతాను విను.

రుక్మాం.—వయస్యా ! ఇట్లు బడలుటకు కారణము నేనుఁ జెప్పనా ?

విదూ.—నీవు చెప్పనక్కరలేదు. నా మూడోమాట ముందుగావిను. రోజుకు ముమ్మారు చక్కగావుదికి పోతచుట్టలవలె తెల్లగా భద్రపరుచుకొన్న మడుగులు ముళ్ళపా దలపాలు చేసుకొంటిని.

రుక్మాం.—ఈ మాత్రమునకు విచారమేల ? నీకుఁ గావలసి నన్ని క్రొత్తయుడుపు లిచ్చెదను లెమ్ము.

విదూష.—నాల్గవది చెప్పుతాను ఇక. నీ పరివారముచేత నిందలు నిష్ఠూరాలు.

రుక్మాం.—మిత్త్రమా ! నా పరివారముచేత నీకేమి నిందలు ; నిన్ను వారేల యందురు ?

విదూ.—ఏలయందురా, ఎందుకో ? ఛాందసబ్రాహ్మణ్ణి నన్నేల యనవలెను.

రుక్మాం.—అదే కారణము. నీవే వక్కాణించితివి.

విదూ.—అదుగో నీవును నన్ను పరిహాసమాడుచున్నావే. చాలు; చాలు నేను వెళ్లిపోతాను. [అలుగుచున్నాఁడు.] మీరు కూడా ప్రారంభించితే ఇక మీ పరివారముచేతులలో నేను బ్రదకగలనా; మీకు నేనంత పరిహాసపాత్రుణ్ణిగా నున్నాను గదా?

రుక్మాం.—మిత్త్రమా, నీవు పరిహాసపాత్రుఁడ వేల యగుదువు? నీవు నాకు వేడుకకాఁడవు. నీవు సేయు వేడుకల యం దాసక్తిచేత నిన్ను నవ్వుమాట లాడుదురు. అయినను వారి నదలించెదను లే. మిత్త్రమా! నీ చెవులలో ఏదో దూరి ఏమియు విననీయకున్నది కాఁబోలు? కొంచెము శ్రద్ధగా వినుము.

విదూ.—అమ్మా! ఏమి నీజాగరూకత ఎవరో పాడుచున్నారు. ఉండు చెప్పుతాను. [సారథి వంకఁ దిరిగి] సారథీ, పాపము గుఱ్ఱములు మిక్కిలి బడలినట్లున్నవి.

సారథి.—అవును. [స్వగతము] నన్ను దూరముగా నంపఁ గోరి యీ బ్రాహ్మణుఁడు ఇట్లనుచున్నాఁడు.

రుక్మాం.—సారథీ! గుఱ్ఱములను జక్కఁగా మేపి నీరుపెట్టి యిచట నీ కొలనిగట్టుననే యుండుము. మేమును ద్వరలో వచ్చెదము.

[అని విదూషకసహితుఁడై పరిక్రమించును.

విదూ.—రాజేంద్రా! నీ జాగరూకత మెచ్చుకో దగియున్నది. ఎంతలో పడిగట్టినావయ్యా! ఆ పాడుచున్నది ఎవ్వరో యెలప్రాయపు ముద్దుగుమ్మవలె నున్నది. ఆ కంఠమాధుర్యం చూడు.

రుక్మాం.—సమీపించితిమి. వయస్యా! మన మిప్పుడే యెదురుగానేఁగిన సిగ్గుచేత పాట నిలిపివేయును. ఆ బాలికామణికి దృష్టిగోచరులముగాక మన మీ పొన్న చాటున నుండి యాలకింతము.

[మోహిని వీణె వాయించుచుఁ బాడును.

రుక్మాం.—నెచ్చెలీ! ఆ వీణె వాయించు సొగసు కనుంగొనుము.

సీ. పురుషుల దుఃఖంపుఁ బుంజంబు తన కొన
గోటితో వడి నెగమీటుభంగిఁ,
గోరిన నెక్కింతుఁ గోపింపఁ దింపుదు
నతుల సుఖాసనం బనెడిరీతిఁ,
చూచిన యతు లైనఁ జొక్కి మ్రొక్కరె యంచు
సారెకు శపథంబు సలుపుమాడ్కి.

సమ్మేళనంబున జగమున రహిఁ బుట్టు
నంచు సిద్ధాంతీకరించు నట్లు,

గీ. గోటమీటుచుఁ దంత్రులు సాటిలేని
ఫణితి నారోహణావరోహణము లెసఁగఁ
దాళగతిఁ జూపుచును భాడతలము చేత
శ్రుతియు రహిమీఱ వాయించు సొగసుఁ గంటె. 19.

గీ. అంబుజాననసంగీత మాలకింపఁ
జేతనత్వంబు వీడి నే శిల నయితిని,
ఐన నేమి ప్రతిధ్వని నీను శిలను
గా నయితిఁ గీడులో మేలు గలుగరాదె? 20.

ఆహా, ఏమి ఈ బాలామణి గానవిద్యాకౌశలము! [ఆనందపరవశుఁడై వినును.

విదూ.—[ఆత్మగతము] ఈ రాజీ బాలికామణిపాట విని పరవశుడవుతున్నాఁడు. ఈ నారీమణిపై నీయన మనస్సు దగిలినట్లుంది. జాడ చూస్తాను గాక. [ప్రకాశము] వయస్యా! పాట వింటిమి గదా. ఇక నిక్కడ దడయనేల? పాట కూడ చాలించింది. పోదాము పద.

రక్షాం.—మఱువుననుండి పాట విని యానందించితిమి. సమ్మానపురస్సరంబుగాఁ బలుకరింపక యే పోవుట సముచితమా?

విదూ.—సరి సరి, ఇప్పుడు పలుకరింపవలెనని యోచనపుట్టిందా? ఆపైన యేమి బుద్ధి పుట్టునో! [ఆత్మగతము] ఆ మదనయ్య బాణవిషం కట్లపాము విషంవంటిది. మెల్లి మెల్లిగా ఎక్కుతున్నది.

మోహిని చెలికత్తెలు.—సహజ కర్కశమైన యీ వీణె తీగెలు కోమలములైన నీ వ్రేళ్లను గందఁజేసినవి. వీణ వాయించి వాయించి కడు బడలితివి. కొంతసేపు ఈ వనములో విహరించి యీ చల్లని తెమ్మెరలచేత సేద దీర్చుకొనుము.

మోహిని.—నెచ్చెలులారా! అట్లే కానిండు. ఈ వనము సకలర్తు సౌభాగ్యంబుచే నలరారుచున్నది. ఈ మోకమావి గున్నలం జూడుఁడు. వనలక్ష్మికి వసంతుండు కానుక పెట్టు కెంపులకమ్మలో యనవొప్పు నెఱ్ఱని చివురుజొంపములతోఁ గర మొప్పారుచున్నవి. ఈ మల్లికాలికుంజములం గంటిరే, అనవద్య హృద్య పుష్పగుచ్ఛసంభృతములై మలయానలపోతంబులకాటపట్టు లయి మనోహరలతాంతామోదబంధురములై పూవుఁదేనియక్కై తమ

కంబున వాలుజమిలిముక్కాలిగమిఝుంకారంబులు వీనులకు విందు సేయుచుఁ బూవిలు
కాని పూజామంత్రంబు లై యొసంగం, గప్పతాలు దాపినపచ్చతా కోష్పరము లై యొప్పు
చున్నవి. ఈ తీఁగెలజంటఁ గనుంగొనుఁడు.

గీ. అనుఁగులును బోలె నీతీవె లనఁగి పెనఁగి
వంగుచును లేచుచును జంట వదల కెపుడు
ప్రాఁకుచున్నవి; గంటిరే? పరమహితులు
కీడుమేలులలో నెందుఁ దోడు విడరు. 21.

రుక్మాం.—వయస్యా! వింటివా; ఈ ముగ్ధాంగన వాగ్వైభవం బెంత యొప్పు
చున్నది.

క. పలువరుస యనెడిము త్తియ
ముల నీనెడివింతశు క్తి పొలఁతుకనో ర
ట్టులు గాకున్నను దెలిచిన
జలజల ముత్యాలు రాలఁ జాలునె యెందుఁ? 22.

విదూ.—రాజేంద్రా! ఈ కన్యకామణి పాట విన గోరిగదా యిక్కడికి వచ్చి
నాము; పాట చాలించింది. ఇక్కడ మనకు పని యేముంది? పోదాం పద.

రుక్మాం.—సెచ్చెలీ! తామరచూలి యీమగువను నిర్మించుట యందుఁ దన నే
ర్పంతయు వినియోగించినాఁడుగదా. ఆ నడబెడం గేమి? ఆ యొయ్యార మేమి? మాటలు
ముద్దులమూటకట్టుచున్నవి గదా?

విదూ.—సరి, పాట మెచ్చుకోవడం అయింది, ఇకను ఈమె రూపాన్ని మెచ్చు
కోవడం ఆరంభించినావా? ఇదే దోవ.

రుక్మాం.—ఎక్కడికి?

విదూ.—(స్వగతము) వినాశానికి. (ప్రకాశము) ఊరికి.

రుక్మాం.—ఎమ్మెకాఁడా! ఇప్పు డింత త్వరయేల? ఈ వన్నెలాడి సౌందర్యమును
కన్నుల కఱవుదీఱఁ జూచి యానందింప వలదా? అద్దిరా! ఏమి యీ చక్కఁదనము!

ఉ. ఈతరళాక్షి మోము శరదిందుసమానము, నవ్వు చంద్రికా
జాతము, నేత్రముల్ వికచసారసముల్, నెఱిగొప్పు షట్పద
వ్రాతము, చెక్కుదోయి ముకురద్వయ, మద్దిర! కీరశారికా
గీతము లుక్తులారయ సఖీమణి మారునిమోహనాస్త్రమో? 23.

ఈ తన్వంగి సర్వాంగములు సంపూర్ణసౌష్ఠవంబున నొప్పుచున్నవి.

క. నవయౌవనలావణ్య
ప్రవిమలరుచిరసము నింపి పడఁతి తన యురో
భవకుంభంబులఁ జేతో
భవునకు విజయాభిషేకవైభవ మొసఁగున్. 24.

గీ. హరుని సాధింపఁ గోర్కి తా నంగభవుఁడు
కాంతయురమునఁ గనకదుర్గముల జంట
కట్టికొనఁబోలు నాఁగ నిక్కాంత కమరు
ఘనకుచంబులు బంగారుకాంతి మించి. 25.

విదూ.—మహారాజా! ఎందటెందటినో గొప్పగొప్పపాటకులను రంభాసమా నలైనరూపవతులను ప్రతిదినము చూస్తూవుండే మీకు ఈమెయం దేమి హెచ్చు గన పడ్డదో గాని నా కేమీ గనిపించలేదు.

దుష్యం.—వయస్యా! అట్లుకాదు.

క. రంభల గింభల గర్వా
రంభం బూరురుచి, రోమరాజిప్రభ నా
గాంభోజాక్షుల నీటును
బంభరచయనీలవేణి భంగ మొనర్చున్. 26.

ఎక్కడియచ్చరలు! ఎక్కడినాగకన్యకలు!

విదూ.—[ఆత్మగతము] బలేబలే, ఈయనకు కట్లపాము విషంలాగ ఈమె మీద మోహాతిరేకము అడుగడుగుకూ హెచ్చుతున్నది. [ప్రకాశము] నీ కీమెమీద అంత మక్కువగలిగితే ఎదురుగా బోయి మాటలాడు; చాటులో దాక్కొని యీ ముసుగులో గుద్దులాట యెందుకు?

దుష్యం.—ఎందుకనకా? మనము సమత్కగతుల మైన సిగ్గుచేత నీబాలికామణి యవలి కేఁగి సందర్శనసౌఖ్యంబు కూడ సున్న చేయునేమో యను జంకుచేత.

విదూ.—అట్లేల జరుగుతుంది? ఈకన్య ముగ్ధ. మఱిన్ని ఆశ్రమవాసం చేస్తున్న ట్లున్నది. ఇంత యెండవేళ సమక్షానికి వచ్చిన యతిథులను సత్కరింపక మానదు.

దుష్యం.—అయితే పోదాం పద.

[ఇద్దఱును బోయి మోహినికెదుర నిలుతురు.

[మోహిని సంభ్రమాకుల యగును.

రుక్మాం.—వయస్యా! మనరాకచే నీపె సంభ్రమాకుల యగుచున్నది. ఇది యను రాగ సూచకమే యగు.

శా. చూడం గన్నులపండువై స్ఫుటముగాఁ జూపట్టె నీముగ్ధహృ
త్క్రీడాబ్జంబున ముప్పిరిం గొనుమహౌత్సుక్యంబు గంటే చెలీ;
వీడెన్ గ్రొమ్ముడి, పర్వె నెమ్మెయిని బ్రస్వేదంబు రోమాంచముల్,
వాడెన్ మోవి, కుచద్వయంబు నుబికెన్, బాదాబ్జముల్ దొట్రిలున్.

మోహిని చెలికత్తెలు.— మహానుభావా! సకలభద్రలక్షణలక్షితులై యపూర్వ సౌందర్యవిలసితు లగుదేవరవా రీవసుంధరకుఁ జక్రవర్తిసార్వభౌము లగుట తెల్ల మగుచునే యున్నది. మాయాశ్రమమునకుఁ దమరు విచ్చేయుట మా పూర్వపుణ్యఫలము. ఈ మావిగున్న నీడ నీ చంద్రకాంత వేదికపై విశ్రమించి మమ్ముఁ గృతార్థులం జేయుఁడు.

రుక్మాం.—చెలువలారా! మీరును గూర్చుండుఁడు.

విదూ.—అనేకమంది గొప్పగొప్ప పాటకులపాట వింటూవుండే మారాజుగారు ఈమె పాట విని అపరిమితానందం పొంది యీమెను చూడడానికి వచ్చినారు.

చెలిక.—భూసురోత్తమా! [అని యేమో చెప్పఁబోవ]

మోహిని.—[వారించి] చెలికత్తెలార! ఈరాజశేఖరుం డేకారణంబుననో మిక్కిలి యలసి యున్నవాఁడు. అర్ఘ్యవిధంబున మున్నుగా నాతిథ్య మొసంగి బడలిక వాపుఁడు.

విదూ.—సరి, ఇక్కడికి ఈమెసంగతిన్ని తెలిసినది. [చంకలు గొట్టుకొనును.

రుక్మాం.—నెచ్చెలీ, ఇ దేమి. అల్లరిచేయుట కారంభించితివి?

విదూ.—అల్లరి కాదయ్యా, నాకు అంతసంతోషంగా వున్నది. చిన్నతనంలో నాకు పెండ్లిచేసినారు మావాండ్లు, ఇప్పటికిన్ని నాకు బాగా జ్ఞాపకం, మా ఆవిడేకూడా పెండ్లిలో నన్నిట్లాగే దొంగచూపులు చూచేది; అందుచేత 'ఆహా! దీనికి నామీద అనురాగం బలంగా వున్నది!' అని నిశ్చయించుకొన్నాను. చూడు నా ఊహ అబద్ధమైనదేమో, నాయిల్లాలు నామీద ఎంతప్రేమతో ఉంటుందో నీవెఱుఁగవా. కనక నీమీద ఈమెకూడా అనుకూలురాలై నిన్ను సుఖపెట్టుతుం దని నాసంతోషం.

[అని యాడుచు 'గౌరి కల్యాణా వైభోగమే,
లక్ష్మి కల్యాణా వైభోగమే.' అని పాడును.

రుక్మాం.—వయస్యా! కొంచెము నిదానింపుము.

చెలిక.— (అర్ఘ్యపాద్యము లొసంగి) రాజేంద్రా! నిర్జనవనంబున నివసించు మేమేపాటియాతిథ్యము సలుపఁగలము. (స్వాదుఫలముల ముందిడి) ఇవి మా చెలి చేతు లార

నీళ్లుపోసి పెంచిన యాతియ్యమామిడిచెట్లఫలములు; ఇవి రుచి చూడుఁడు.

రుక్మాం.—చెలువలారా! మీచెలి కేవలము ఎల్లప్రాయపుజవ్వని. ఇట్టి నిర్జనవనంబున నుండుకత మెయ్యది? ఏ యతుర రత్నము లీమెపేరై యనర్ఘంబు లయినవి. ఈ లచ్చికి పుట్టువునొసంగిన పాల్కడలి యేవంగడము?

చెలిక.—ఈమె బ్రహ్మమానసపుత్త్రి. ఈమెపేరు మోహిని, ఇఁక నీమె యీ నిర్జనవనంబునం దుండుటకు కారణము మాకును దెలియదు.

విదూ.—సరిసరి! ఆ కారణము మీకు తెలియలేదా? నేను చెప్పనా? అనురూపు డైనభర్తను కోరి తపస్సు చేస్తూవున్నది.

మోహిని.—(విదూషకు నుద్దేశించి) ఆర్యా! మే మిట నేకాంతమున నున్నవారము. యథాశక్తిని మేము సేయు నతిథిసత్కారము నంగీకరించి మమ్ము మన్నించి వేగ దయచేయుఁడు. నా తపం బెట్టులేని ఫలియించునుగాక.

రుక్మాం.—వయస్యా! నీవు తొందరపాకివి గదా. నీవు తొందరపడి ఆడినమాట ఫలము గంటివా?

విదూ.—చాలుచాలు! నీ వూరకుండు. నామాటలఫల మేమో నాకు తెలిశే ఉన్నది. ఈమె నిన్నిక వదలు ననుకొన్నావా? ఇదంతాకొంచెం స్త్రీల సహజగుణమైనబెట్టు.

రుక్మాం.—సరి, త్వరగా మనలను వీడ్కొనఁ దలఁచుచున్నట్లున్నది ఈమగువ.

విదూ.—వెళ్లిపోకుండా చేయడానికి నీ కేమిన్ని ఉపాయం తోచలేదటయ్యా?

రుక్మాం.—అది యేది వివరింపుము.

విదూ.—అది యేదా? ఇదుగో పండు చేత బుచ్చుకో, మెల్లిగా ముక్కలు తరిగి యిలాగు మెల్లిగా ఈలాగు ఒక్కటొకటి నోట్లోవేసుకొని మింగుతూ కూర్చో.

[అభినయముతోఁ జూపును.

రుక్మాం.—నీ కింత ఆఁకలిగా నున్న దేమో గాని, నా కట్లు గాదు.

విదూ.—ఆకలా? ఎవరికి? మంచిబుద్ధిశాలివే. నీవిట్లా చేస్తూ వుంటే, నిన్ను విడిచిపోకుండా ఎదటనిలుచునుగదా అని యుపాయము చెప్పినాను. అతిథివైన నీవు పలహారముచేసి దాహముపుచ్చుకొనేవరకు ఈమె ఎట్లుపోగలదు? [రా జట్లు చేయును.

చెలిక.— ఇది మాసెచ్చెలి క్రీడాసరోవరతటంబునం బెరుఁగుచున్న ద్రాక్షతీఁగెల ఫలములనుండి జారిన తేనె. దేవరవారు చవి చూడవలయును.

విదూ.—నీళ్ళన్నీ పల్లానికే పాఱును. కలిగినవారికే పెట్టుతా రందఱూ. మగువలార్లా! మీచెలికి మక్కువకాడు గనుక మీ రీమహారాజును మిక్కిలి ఆదరంతో వుపచరిస్తూ ఉన్నారు. పేదబాపనయ్యను నన్నెవ్వరు పరామర్శిస్తారు?

చెలిక.—మా చెలికి వేడుకకాఁ డెవరు? పురుషులపొత్తొల్లక గదా మాచెలి యీ నిర్జనవనమున నుండుట.

విదూ.—రాజేంద్రా! ఇంకెందుకు ఇక్కడ గుటకలు మింగుతూ కూర్చోవడం? పోదాము పద, త్వరత్వరగా పండారగింపు కానీ.

రుక్మాం.—నా మనోరథము తెలిసికొనియు నన్నిట్లేల యలజడి పెట్టెదవు నెచ్చెలీ? ఈ పల్లవాధరను విడిచి నేను రాఁగలనా?

మ. చలదాకాశధునీతరంగములఁ గ్రాఁకుచుం దూఁగుచుం, జంచదు
త్పలనాళంబు ముదం బొసంగఁ గని, శుంభత్కోకరకద్వంద్వ మిం
పలరం గూడినతమ్మిఁ జొచ్చి, మకరందాసక్త మహాహంసముం
బలె నాబుద్ధియు నిష్ఠ గ్రమ్మఱదు తద్బాలాసహాసాసక్త మై. 28.

విదూష.—అట్లా అయితే పీటవెట్టుకొని కూర్చుండవయ్యా, మెడబట్టుకొని గెంటుతూ వుంటే మూలుపట్టుకొని వేలాడుతావు.

రుక్మాం.—నెచ్చెలీ! నీవు తోడుపడక నాకుఁ గార్యసిద్ధి యగునా?

విదూ.—అది యిప్పుడు తెలిసిందా?

రుక్మాం.—ఇంతకుముందు మాత్రము నీవు కాదని నేను జేసినపని యేమున్నది? ముందుపని యోజింపుము.

విదూ.—మగువలారా! మీ చెలి ఎందుకు ఈలాగ అపూర్వరూపవంతుడున్నూ అఖండైశ్వర్యసంపన్నుడున్నూ అయిన మారాజాగారి పట్ల మిక్కుటమైన సిగ్గవలంబించింది. ఇక్కడ కొత్తవాళ్లెవరున్నారు? కన్యకకి దనకి స్వేచ్ఛావిహారం తగిందేగదా.

మోహిని.—ఆర్యా! అతిథు లైనమీరిరువురును మాకుఁ బూజ్యులే. చెలికత్తెలారా! మన యేకాంతస్థితి నైనఁ దలంపక యీ బ్రాహ్మణుఁడు చదురులాడ నారంభించినాఁడు. మఱియు సాయంకాలపూజకుఁ బువ్వులుకోసికొని రావలసి యున్నది. అతిథేయసత్కారము సత్వరమున ముగించి యీ రాజశిఖామణివలన సెలవంది కుసుమాపచయమ్మునకుఁ బోవలయు.

చెలిక.—రాజేంద్రా! మా నెచ్చలి సాయంకాల పూజకై కుసుమములఁ గోసికొని రాఁబోవు సమయ మైనది. దేవరవారు మాయం దభిమానముంచి మేము చేసిన వనవాసి యోగ్యమైన సత్కారము గ్రహించి మమ్ము సంతోషపెట్టినందునకు మా వందనములు గైకొని మాయం దనుగ్రహించి మాకు సెల వొసంగుఁడు.

విదూ.— మగువలారా! మేమే మీ చెలికత్తె యనుగ్రహానికై కనిపెట్టుకొని వున్నాము.

మోహిని.—మీ రిటుఁ గొంతవడి విశ్రమింపఁ దలఁచిన మాకది సమ్మతమే. భూపాలతిలకా! నాకును నాచెలికత్తెలకును సెలవొసంగుఁడు; పుష్పాపచయమ్మునకై పోయి వచ్చెదము. [మోహినియుఁ జెలికత్తెలును నిష్క్రమింతురు.

రుక్మాం.—వయస్యా! ఇఁకెట్లు? నీమాటల కలిగి వెళ్లిపోయిరిగదా?

విదూ.—రాజేంద్రా! అంత వుపేక్ష చూపుతున్న యీకన్యకమీద నీకింకనూ అనురాగమేనా?

రుక్మాం.—వయస్యా! నేను వారించినను నాఁగక నీ వాడినమాటల కలిగియే యీ కన్యకామణి వెళ్లిపోయినదిగాని నాయం దనురక్తచిత్తయే యగును.

క. చతురత నాముగ్ధాంగన
యతిగుప్తము చేసినట్టి యాత్మస్యంబే
మితి మీఱి గన్నుదోయిని
స్మిత మై గనిపించి ప్రియమె చెప్పెను నాకున్. 29.

విదూ.—రాజేంద్రా! కొపము నామీద బెట్టడానికి యిట్లా అంటున్నావు. నీమీద అనురక్తురాలు అని నేను మొదట అనుకున్నానుగాని ఇప్పుడు నాకట్లా తోచలేదు. ఇక పోదాముర్రా, ప్రొద్దులేదు.

రుక్మాం.—వయస్యా! కాదు ఆ సుందరాంగి నా కనుకూలస్వాంతయే యగును జుమీ. కన్యకగావున సిగ్గుచేత నిట్లు చేసినది. నీతప్పుచే నైనముప్పు నీవే తీర్పవలయును.

విదూ.—నే నెట్లు తీర్చగల్తును. ఈ నీ రాజ్యములో నున్న యలంకారాలన్నిన్ని బెట్టి నన్ను సింగారించినా నేనా పెవలె నుందునా?

రుక్మాం.—వయస్యా! ఈనర్మోక్తుల కిది సమయమా?

విదూ.—మంచిసమయమే; ఆవిడను నీవు గూర్చ మని న న్నడగడానికి.

రుక్మాం.—మిత్త్రమా! న న్నలజడి పెట్టకుము. నాకీ వియోగపరితాపము దుర్భరం బగుచున్నది. నాకాకన్యను నీవు గూర్చినంగాని ప్రాణములు నిలువవు. [అని మూర్ఛిల్లును.

విదూ.—నామంత్ర మెదురుతిరిగిందిగదా (సత్వరముగ తామరలను గప్పుచు) సమయానికివి యిక్కడ ఉన్నవి. లేకుంటె యేమై యుండును. [రాజు లేచి కూర్చుండును.

రుక్మాం.—

అనంగుఁ జెలికాఁ డా
అనంగుఁ డదయుం డై

ఘనంబుగ శరమ్ముల్
మనం బెరియ నేసెన్. 30.

అయ్యో ప్రియసతీ, ఎంత దయావిహీనవై వెడలి పోయితివి. [వెండియు మూర్ఛిల్లును.

విదూ.— నే నన్నట్లు కట్లపాముపిషమువంటిదే ఈయనమోహము (సత్వరముగా పుప్పొడిం దెచ్చి పైఁ జల్లుచు) భళి భళీ! ఏమి యీ వెఱ్ఱి. మహాధైర్యశాలి యైన యీయన యీగోలకోసం యెంత దైన్యము పొందినాడు.

రుక్మాం.—సుమసాయకా! నామీఁద నిట్లేల బాణవృష్టి గురియుచున్నావు? నీ చేతఁబడి మిక్కిలి కోమలము లయిన యీ పద్మము లెంత కలఁకుఁదనము వహించినవి? నెచ్చెలీ! ఆముద్దరా లెక్కడ?

అంచపిల్లనడ మించున్
మించుఁదీవె హసియించున్
గాంచనమ్ము మఱపించున్
జంచలాక్షి వలపించున్. 31.

విదూ.—ఇంత మోహాన్నిత డెట్లు గంభీరంగా ఇంతసేపు దాచినాడు?
[మృణాళములు పేర్చును.

రుక్మాం.—[లేచి కూర్చుండి]వయస్యా! ఏల యిట్లు వినోదము చూచుచున్నావు?

జలజదళనిభనేత్రన్
లలితసుమచయగాత్రన్
జెలి ననుఁ గలిపి మైత్రిన్
నిలుపు ముసురుల ధాత్రిన్. 32.

నెచ్చెలీ! సత్వరమ్ముగఁ బోయి నాయుదంత మాముద్దుగుమ్మ కెఱిఁగించి యెట్టులయినఁ దోడ్కొని రమ్ము.

విదూ.—అలాగే చేస్తాను. ఇంతకూర్మి పేర్మిగల పురుషుణ్ణి ఉపేక్షించే స్త్రీకంటె మందభాగ్యురా లుండునా; నీ వృత్తాంతం సాంతంగా జెప్పి తోడ్కొని వస్తాను. నీవు గాసిల్లకు.

రుక్మాం.—పోయి రమ్ము. నే నిచ్చట ఆశాపాశములచేత బంధించి ప్రాణముల నిలుపుకొనియుండెద.

విదూ.— [పరిక్రమించి] నేను జూడలేను ఈయనదురవస్థను. మఱి ఈయనను

విడిచి వచ్చితిని. పాపము, ఈయనగతి యేమవుతుందో కదా. ఆలసింపదగిన స్థితికాదు. ఆమోహనాంగి యీదెసనే పోయింది. ఈ దారినే పోయి వెతుకుతాను. అబ్బా, నాకాళ్లు పచ్చిపుండ్లు లాగున్నవి. పైగా ఈ పాదుపొదలమధ్య నడవడానికి కాళ్లాడడం లేదు, గజగజ వడకుతున్నవి. ఏమి చేయవచ్చును; వెళ్ళక తప్పదు. [ఉలికిపడి] ఏమి టాచప్పుడు! ఈ పొదలో గలగల్లాడింది. పామో మండ్రగబ్బో! ఈ దారి విడిచి ఆపక్క దారిని నడుస్తా. [నిష్క్రమించును.

రక్షాం.—ఈ ముద్దుగుమ్మ నాదురవస్థ విని నాయెడఁ గరుణార్ద్రహృదయ యై వచ్చునో రాదో కదా. ఈ వియోగతాప మెట్లు సహింపఁగలను? నా యీ నేత్రములే నాకిట్టి యపకారము చేసినవి.

శా. తా మై పిల్వనిపేరఁటం బరిగి నేత్రమ్ముల్, దదబ్జాక్షిపైఁ
బ్రేమాయత్తముఁ జేసి నామదిని, దద్విశ్లేషమున్ సైఁపఁగా
లేమిం బ్రాణము వాయ నేఁ గడఁగ, జాలిం బోలెఁ జల్లార్చు ను
ద్దామక్లేశశిఖిన్ని జాశ్రుతతిచేతన్ ద్రోహు లట్లే కదా? 33.

సకలభువనరక్షాపరాయణుం డయినయంబుజోదరునిపుత్త్రుఁ డైన యీకుసుమబాణునే ప్రసన్నుండుగా వేఁడికొనియెద. సరిసరి! ఇదేటి వెఱ్ఱితనము. పాంథుల నలయించుటకుఁ దా నొక్కఁడు చాలనట్లు పవనశశాంకులంగూడఁ దోడుచేసికొని నాపై విజృంభించు వాఁ డీమన్మథుఁడు. ఆ నాలిభూతమును, ఈదోషాకరుఁడును, ఈవికలాంగుండును, మువ్వురును దుష్టత్రయము గదా? మిక్కిలి నేర్పరు లయిన మోసగాండ్రు వీరు. ఏల యన?

చ. రతివిభుఁ డేఁచుఁబో యనపరాధియుఁ బోలె ధరించి సూనముల్,
వెత గలిగించుఁ గాదె శశి వెన్నెలఁ దాల్చియు సాదుమాడ్కి, ను
ద్ధతి ననిలుండు సేయుఁ గద తాపము చల్లగ వీచుమాడ్కి నే;
యతిశయ మైనయట్టి వినయంబును ధూర్తునిచిహ్నమే కదా? 34.

కావున మదనుఁడు శరణ్యుఁడు గాఁడు. మఱియు నీతనిది నిరర్థక విజృంభణమే కాని యితనిచే నగుకార్య మేమున్నది? ఓరి దర్పకా! సంఘటనాదక్షుఁ డను కీర్తి ఈతనికిఁ నేతిబీరకాయవాసిగదా?

ఉ. ఊరక నాపయిన్ ములుకు లుద్ధతి నేసి మనోభవుండు నన్
ఘోరవియోగదుఃఖశిఖికుండమునం బడవైచెఁ గాని, యీ

నీరజలోచన న్గలఁచి నెయ్యము నిర్భరకు న్ఘటింపఁగా
నేరఁడు పో, పురాకృత వినిశ్చిత మిమ్మహి నెయ్య మెల్లెడన్. 35.

ఈతని చమూపతులను, ఈతని బాణములను, ప్రసన్నత వహింప వేఁడుకొనియెదం గాక.
అంగజచమూపతులారా! తదీయబాణమ్ములారా!

సీ. పడఁతి న జ్జిలిబిలి పల్కులు పల్కుచో
మి మ్మోసడింపఁ గీరమ్ములార!
వెలఁదిముంగురుగముల్ వేడ్కమై దిద్దుచో
మి మ్మోసడింప భృంగమ్ములార!
అతివ నాపై మందహాసంబు నెఱపుచో
మి మ్మోసడింపఁ బుష్పమ్ములార!
కలకంఠి దయ నన్నుఁ గన్నారఁ గాంచుచో
మి మ్మోసడింప మీనమ్ములార!
గీ. ఇంతి నా దైనయపుడు మి మ్మోసడింతు
నంచు నామీఁదఁ గ్రోధంబు నాత్మఁ బూని
ఖలునిఁ బూవిల్తుఁగూడి యీకరణి నన్ను
నెతలఁ బెట్టకుఁడి మీకు నతు లొనర్తు. 63.

[నేపథ్యములో కోలాహలము].

రుక్మాం.—(నల్గడలఁబరికించి) ఏమి యీ కోలాహలమ్ము, అబలాస్వరమ్ములు కదా; మోహినియును ఆపెచెలికత్తెలును అడవియం దెవరివలననైనఁ గీడొంది యాక్రందనము సేసిరో? ఎవ్వ రైన నేమి? నివారించెదం గాక.

ఉ. వచ్చితి వచ్చితిన్; భయము వాయుఁడు; భూమితలంబు సర్వముం
బొచ్చెము లేనిదర్పమునఁ బ్రోదియొనర్పఁగఁ బూనియున్న నే
నిచ్చటనుండ మీకు భయ మేమి? మదీయ కృపాణధారచేఁ
జెచ్చెర మీకుఁ గష్టమును జేసిన కట్టిఁడిఁ దున్మి వైచెదన్. 37.

[అని కోలాహలము వినంబడినదెసఁ బరువెత్తును.
[మోహిని యొంటరిగ నిలిచి గడగడ వడఁకును.

రుక్మాం.—(చేరఁబోయి చేయిపట్టుకొని) అహో మోహనాంగీ! నీకెవ్వ రేమికీడు పాటొదవించిరి? ఏల యిట్లు వడఁకుచున్నావు? నీ వొంటరిగనుండఁ గతమేద్ది? నీచెలికత్తె లేమైరి?

మోహిని.—రాజేంద్రా! సాయంకాలపూజాగ్రమయి మే మిచ్చటఁ బూలుగోయుచుండ నాదట్టంపుటీరమ్ములమఱుఁగున పెద్దసందడి యైనది. దానిని విని అం దెద్దియేనిఁ గ్రూరమృగ ముండనోపు నని భయభ్రాంతలై యాక్రందనము సేయుచు నా చెలికత్తెలు చెల్లాచెదరై పరువెత్తిరి.

రుక్మాం.— ఈ పొద మఱుఁగుననా సందడి అయినది? [పరిక్రమించి, భయవిహ్వలుఁడై నిలువఁబడి వడఁకుచున్న విదూషకుం గని] వయస్యా! నీవేల యి ట్లడలుచున్నావు? భయాకులచిత్తలైన యీ మగువలభయంబు వాపుటకు బదులు నీవే యడలితి వేమి?

విదూ.—మిత్రమా [అని గట్టిగాఁ గవుంగిలించుకొని] సరిసరి, నీకు లోకమంతా అబలలమయమై కనుపడుతున్నది. నేను నీ యాజ్ఞచే మోహినిని వెతుకుతూ ఇక్కడికి వచ్చితిని. ప్రతిపొద కదలించి వెతికితిని. ఈ యెండిన పొదలో విస్తారము స్థలమున్నందున దాన్నికూడా గదిలించాను. ఇంతలో పెద్ద కోలాహలం వినబడ్డది. నేనిక్కడ కదపగానే ఆవైపు పారిపోయిందిగాబోలు పెద్దపులి, ఆ వైపున ఉన్నవా ళ్లెవరో పెద్దకోలాహలం చేశారు. ఆ కోలాహలానికి బెదరి నా దిక్కుకే మళ్లివచ్చి నామీఁదఁబడి నన్ను చంపేస్తుందిగదా ఆ పెద్దపులి అనిభయపడి యీలాగ అడలినాను, అంతేగాని ఈ యబలల కేదైనా అపాయం గలిగితే వూరుకుంటానా?

రుక్మాం.—[నవ్వుచు] నీ సాహసము మెచ్చుకొనఁ దగియున్నది. [మోహిని నుద్దేశించి] ఇదిగో మీకు భయకారణ మైన క్రూరమృగమునుఁ జూచితివా? ఈ తండీ యెండినపొదను కదలించిన నిట్టి సందడి అయినదిగాని వేఱు గాదు. క్రూరమృగంబుల నన్నిటి నీ యుదయమున నేగదా నిర్మూలంబు చేసితిమి.

విదూ.—రాజేంద్రా! నన్ను భయంకరమైన యీ అడవిపాలుచేయడమే గాకుండా పైపెచ్చు నన్నే క్రూరమృగమంటావా? [సరోషముగా] నీకు నాతో పని తీరింది. నన్నిట్లా హేళనం చేస్తున్నావు. ఇంతకీ నీకు ప్రియ దొరికింది. ఇక నేను పులగంమీదిపప్పు నీకు. నా కెందు కీగొడవ. నేను పోయి హాయిగా గథంలోఁబడి నిద్రపోతాను.

రుక్మాం.—మిత్త్రమా! అలుగకుము; నీమూలముననే కార్యసిద్ధి అయినది.

విదూ.—రాజేంద్రా, [సానురాగముగా] ఒక్క రహస్యము చెప్తాను ఇలారా. [జనాంతికము] ఈమె నిజంగా మోహినీ శాకినీ ఢాకినీ ఛేకినీ భేకినీ మొదలయిన భూతగణాలలోఁజేరిన మోహిని సుమీ.

[రాజు నవ్వును.

విదూ.—అదుగో నామాటగా ఉంటుందని ఆమెయెదుట చెప్పడానికి సంకోచ పడినాను గాని; నీకు చెప్పకుండా ఉండడానికి మన యిద్దరికీ గల నేస్తముచేత నాకు మన సొప్పింది గాదు. నేను మొట్టమొదట ఆపాదమీదుగా నిక్కి చూచేవరకు ఇలాగే కనుపించింది. తరవాత పెద్దనోరు తెరుచుకొని పెద్దపులికిమల్నే నామీదికి దుమికేటట్లుగ పడ్డది. ఇప్పుడు యథాపూర్వాకారంతో గనుపడుతూ వుంది. ఇందేదో మోసముంది. ఈ భూతంతో మనకేం పని? పోదామురా.

రుక్మాం.—వయస్యా! నీవు మిక్కిలి ధీరుఁడవు గదా?

విదూ.—రవంతసేపటికి ముందు నేను జూచిన ఆ పెద్దపులిని జూస్తే నీ ధైర్య సాహసాలున్ను బైటపడివుండును. మఱి ఆ పెద్దపులి యేమిటి అంటావు?

రుక్మాం.—నీ భయవికారమేగాని వేఱుకాదు. నీ కంత భయముగా నున్న నీవు పోయి రథముమీఁద పండుకొని నిద్రపో. నే నిప్పుడే వచ్చెదను.

విదూ.—నీయిష్టం. చెప్పవలసినమాట చెప్పినాను. హిత మెవ్వరికిన్ని రుచిం చదు. నేను బోతున్నాను. [నిష్క్రమించును.

రుక్మాం.—[మఱలి వచ్చి మోహినిచేయి పట్టుకొని] మనోహారిణీ! నీ కీభయదా రణ్యవాస మేల?

క. క్రూరమృగసంకులం బీ
ఘోరాటవి, యిందు నీదు కోమలగాత్రం
బీరీతి నేల యలఁచెద?
వారామ వ్రతతి యడవి కర్హం బగునే? 38.

నాపురమునకుఁ దీసికొనిపోయెదను రమ్ము.

మోహిని.—యౌవనవతి నైన నేను నీ పురమ్మునకు రాఁదగునా? ఇది దూష్య మైన పనిగదా.

రుక్మాం.—పల్లవాధరా! నిన్ను నేను అగ్నిసాక్షిగ మహావైభవంబునఁ బెండ్లి యాడెదను. అది దూష్యము కాదు గదా? నీయెడ నామనంబు బద్ధానురాగ మై యున్నది. నిన్నుఁ బాసిన యీరవంతసేపు నాకు నూఱు యుగములుగాఁ దోఁచినది.

చ. వలపులకొల్కి, నాహృదయవారిజవప్రము నాక్రమించి యు
జ్జ్వల భవదీయ నీలకచ శాతకృపాణము దూసి యుద్ధతిఁ
లలితభవన్మనోజ్ఞ శుభనామమునే జయశాసనంబుగాఁ
జిలుకహుముమావజీరుఁ డతిచిత్రగతిఁ లిఖియించె నాస్థలిఁ. 39.

నీరూపమే ధ్యానముగా, నీపేరే జపముగాఁ గడిపితింగదా; అతిదీర్ఘ మైనయాకాల మంతయును.

మోహిని.—నృపాలాగ్రణీ! నేఁ బూనినవ్రతం బెఱుఁగక యిట్లు పలుకుచున్నావు. నేను బురుషుల సాంగత్యము చేయ నని వ్రతము పట్టితిని.

రుక్మాం.—కాంతామణీ! ఇ దేమి వ్రతము? నీయట్టి యెలప్రాయంపు సుందరాంగుల కిట్టివ్రత మొప్పునా?

క. కుందనము లేని మణి, నెల
పొం దెఱుఁగనిరాత్రియు, వలపులమాకందం
బందనిమాధవి, పురుషుం
జెందనిజవ్వని బెండగుఁ, జెన్నొంద విలన్. 40.

ఉ. కాలము లేదొకో వ్రతనికాయపరత్వమునం జెలంగఁగాఁ?
బోలునె నిండుజవ్వనము పోకడ వెట్టి, యరణ్యచంద్రికా
జాలముచేసి, పుష్పసదృశం బగు మే నలయింప నిట్లుగాఁ?
నోలి సమస్తభోగముల నొంది తుదిన్ వ్రత మూనఁగాఁ దగున్.4.

మోహిని.—రాజేంద్రా! ఇదివరకే నూర్వురు సుందరాంగులను బెండ్లియాడితి వని వింటిని. ఇప్పటి కను వేదురున నిట్లు పలుకుచున్నావుగాని నామీఁద నిక్కమైన మక్కువ నీ కెట్లు గలుగ నోపును?

రుక్మాం.—మోహనాంగీ! నిన్నుఁ గాంచినది మొదలు నా మనంబు నీయందు లగ్నంబై యున్నది.

చ. సరసతమీఱ నా హృదయషట్పద మంబురుహాయతాక్షి, సుం
దర మగు నీముఖాంబుజముతావులఁ గ్రోలుచు భవ్యతావకా
ధర పరిపక్వబింబ మధుధారల నానుచుఁ జూర్ణకుంతలో
త్కర మధుపాళిఁ గూడి ప్రమదంబున నాడఁగ నుత్సహించెడున్.42.

శా. క్ష్మాపాలాత్మజసంచయావిరతదాస్యం బందుచుం బెంపు సొం
పాపాదింప మదీయచంద్రమణిశుద్ధాంతంబులన్ హంసదో
లాపర్యంకతలంబులం దుపవనశ్లాఘ్యప్రదేశంబులం
దేపారంగ సుఖించుచు న్నలుపరాదే నాసిరిన్ ధన్యముగ్.? 43.

మోహిని.—రాజచూడామణీ! కామినీమనోభవా! నీకు నాయెడ నిక్క మైనయనురాగ ముండుఁగాక. నీ యఖండైశ్వర్యగరిమంబుచే నన్ను సుఖపెట్టెదవుగాక. బ్రహ్మమానసపుత్త్రి నైన నేను మానవస్త్రీ యగు నీపట్టపుదేవికి లోనై యెట్టు లుండనోపుదును?

రుక్మాం.—

మ. శరదిందుప్రతిమాననసుందరముఖీ! సందేహముల్ వాసి, నా
ధరణీరాజ్యము సామజాశ్వరథజాతమ్ముల్ భటవ్రాతముల్
వరపుత్త్రుం గులకాంతలం బ్రభుతమైఁ బాలింపుమీ వైభవం
బరుదారన్ ననుఁ బెండ్లియాడి, గనుమీ! యక్షీణ సౌఖ్యంబులన్.

క. చెలి నేఁ డాదిగ నీమన
మలరంగాఁ జేయుచు ననయము నీ కనుస
న్నల మెలఁగువాఁడ; నని బా
సలు సేసెదఁ, గామదేవసాక్షిగ నిచటన్. 45.

[మోహిని మాఱుపలుకక సిగ్గునఁ దలవంచి పెడమొగమై యూరకుండును.

రుక్మాం.—(బిగికౌఁగిటం జేర్చి) కోమలాంగీ, సంపూర్ణరాకాచంద్రవదనా, సుధామధురాధరా, కమలకోరకవిస్ఫురణాపహాసివక్షోరుహా, కించిదవలగ్నా, రంభాకాండోపమమృదుభాస్వరోరుయుగళా, పులిననితంబా! అని యేమో చెప్పఁబోఁగా.

మోహిని.—సకలధర్మరక్షాపరాయణా! విధ్యుక్తముగఁ బెండ్లియాడునందాక నేను బరాంగననే కదా?

రుక్మాం.—(కౌఁగిలివిడిచి) మనోహారిణీ! ఆనందపరవశత్వంబున మఱచితిని. ఇఁక నాలసింపనేల? పురమున కేఁగుదము రమ్ము.

మోహిని.—హృదయవల్లభా! ఇది ధర్మమా? నా చెలికత్తెల నీభయంకరారణ్యము పాలుసేసి పోఁగూడునా? [ఆత్మగతము] ఈయన ధర్మాచరణవిస్మృతియే నాకు జయావహంబుగానోపు.

రుక్మాం.—ఇష్టావాప్తిచే సకలము విస్మృతిపాలగుచున్నది. నా కింతటినుండి సహధర్మచారిణివై నాధర్మంబు కాపాడుము. [చెలికత్తెలు చేరవత్తురు.

[మోహిని బిరీనఁ బోయి కవుంగిలించికొనును.

చెలిక.—నెచ్చెలీ, ఏమి నీటక్కులు! ఏదీ, ఇటు ద్రిప్పుము నీమోముఁదమ్మి, ఆ రాజేంద్రునివదనారవిందము కొండెము చెప్పుచునే యున్నది. [మోహినిమోమును యత్నమునఁ ద్రిప్పి ఒక్కొక్కరుగ ముద్దులాడుదురు. మోహిని నిశ్చేష్టితయై నిలుచును.

చెలిక.—నీవు కడుధన్యురాలవు. భూపాలతిలకా! నీవు మానెచ్చెలిని మానవ స్త్రీలతోపాటిదానినిగాఁ జూడఁ దగదుసుమీ.

రుక్మాం.—మగువలారా! మీకును సమ్మతమే యగుట మదీయ భాగ్యవారాశికి చంద్రోదయము. పురమునకుఁ బోవుదము రండు.

[అందఱు నిష్క్రమింతురు.

ఇది చతుర్థాంకము.

---

## మిశ్రవిష్కంభము.

---

### స్థలము—రాచనగరిలో మోహినీదేవియంతఃపురము.

### మోహినీదేవియు చెలికత్తెయుఁ

### బ్రవేశింతురు.

మోహిని.—చెలీ, సాగరికా, ఇంతవఱకు నాప్రయత్న మంతయు సఫలమే. ఈ రాజేంద్రుఁడు నాకుఁ బ్రియంబు సేయుటయే వ్రతముగా నింతవఱకుఁ బ్రవర్తించుచున్నాఁడు. కాని, నేఁటి యితనిచర్య కొంచెము విపరీతముగా నున్నది. నన్ను వివాహమైనది మొదలు నామందిరముననే యహోరాత్రములు గడపుచుండినవాఁడు నేఁడు ఉదయము నిద్రలేచినతోడనే ఈదినము దశమి యొక్కప్రొద్దుండి హరిసంకీర్తనంబున రాత్రి జాగరము చేయవలయు ననియు, మధ్యాహ్నమునుండి వ్రతమండపమున కేఁగెద ననియుఁ, జెప్పినాఁడు.

సాగరిక.—సరిసరి ! మీమాట యేమన్నాఁడు ?

మోహిని.—నన్ను నా సపత్నులతోఁ గలిసి గౌరీపూజసేయుచు సాయంకాలము వఱకుఁ బ్రొద్దుఁగడపి, ప్రొద్దు గ్రుంకినమీఁదట వారితోడ వ్రతమండపమ్మునకు రమ్మని యాజ్ఞాపించినాఁడు.

సాగరిక.—బాగానే ఉన్నది. ఇక మీరు జాగ్రతగా ఉండండి. ఈమహారాజు కొంచెం చపలచిత్తుడికిమలె వున్నాడు.

మోహిని.—నెచ్చెలీ, అట్లనెద వేల ?

సాగరిక.—అయింది. ఈయనకు మోజు తీరింది. ఇక మళ్లీ యెవరిమీద కన్నేస్తాడో ! ఇప్పటికి నూరుగురిని జోగులను చేశాడు. ఆనూరుగురు ఈమహారాజు తమమొగమిక చూడడని మనస్సు ఱాయి చేసుకుని వైరాగ్యంలో ప్రవేశించారు. మిమ్మును కూడా ఆజోగిమూకతో గలియమని చెప్పనే చెప్పాడు. అయింది యిక్కడికి మీరు వచ్చినపని. ఇక త్వరగా మీతండ్రిగారిదగ్గిరికి పోదాం పదండి.

మోహిని.—ఓసీ వెఱ్ఱిదానా, వ్రతవిఘ్నము చేయుట కేవిధమైనప్రయత్నమును జేయకయే మఱల మా జనకునికడ కేఁగినచో వారు నామొగము చూతురా ? ఇదిగాక రాజుగారికి నా మీఁదివలపు తగ్గ లేదు. వ్రతమందుఁ గల భక్తిచేత నేఁడు నన్ను విడిచి వెళ్లినారు.

సాగరిక.—సరే, అయితే ఈరోజు రేపూ వ్రతం చేసుకుని ఎల్లుండి ద్వాదశి నాడు మీకు దర్శన మిస్తారు లెండి. ఈ యేకాదశికి కాకపోతే వైయేకాదశి వ్రతభంగం చేయవచ్చును. మీకున్ను మంచి అనుకూలమైననాయకుడు దొరికాడు. తొందర యెందు కని తోచింది కావల్ను ?

మోహిని.—సాగరికా, న న్నేలయిట్లు పరిహాసించెదవే? ఈనిందకు నాలోప మేమి ?

సాగరిక.—వ్రతభంగం చేయడానికని వచ్చినదానికి వ్రతం చేసుకొని రం డని ఆయన్ను పోనియ్యడం లోపము కాదా యేమిటి ?

మోహిని.—నేఁ జెప్పుసంగతి యంతయు వినకయే నన్ను నిందింపఁ దొడఁగితి వేమే నెచ్చెలీ? నే నాయన చెప్పినమాటల కన్నిటికిఁ దలయూఁచి పోనిచ్చితి ననుకొంటివి కాఁబోలు.

సాగరిక.—ఇప్పుడు చెప్పు; మరి పూర్తిగా నీవు చేసినపని యేమిటో.

మోహిని.—క్రొత్తవారితోఁ గలసి మెలసి యుండుటకు నాచేతఁ గా దనియుఁ బారణానంతరం నామందిరమునకే యరుదెంచిన నిద్దఱముఁ గలిసి హరిభజన సేయుచుఁ, బ్రొద్దు పుచ్చ ననువుగ నుండు ననియు, నా శ్రీహరిప్రభావమును లీలలును వర్ణించుకృతులు నా కనేకముగ వచ్చు ననియు, మాతండ్రిగారిపంపున శ్రీనారదులవారు నా కాకృతులు పాఠము చెప్పి రనియుఁ, జెప్పి పారణ అయిన వెంటనే నామందిరమునకు ర మ్మని వేఁడితిని.

సాగరిక.—వారు వప్పకొన్నా రా.

మోహిని.—అ ట్లయిన నాసవతులను కూడ నామందిరమునకే రావించి యచ్చటనే హరిభజనతోఁ గాలక్షేపము చేయుద మనిరి.

సాగరిక.—(పకపక నవ్వి) చాతుర్యం గలవాడే యీరాజు. ఇదంతా తెచ్చుకోపోయి పారవేసుకున్న ట్టున్నది.

మోహిని.—ఏమే నెచ్చెలీ, ఎందునకు నవ్వుచున్నావు.

సాగరిక.—ఎందుకేమిటి, వ్రతం మాన్పడానికి బదులు నీవే ఆవ్రతం చేసేటట్టు మాయచేసినాడుగా. నిన్ను నీసవతులకు భద్రంగా వప్పగింతపెట్టుతాడులే; నీకు భయం లేదు. నోములు వ్రతాలు పూజలు పునస్కారాలు చేసుకుంటూ నీవిక్క డుండు.

[అని వీపుతట్టును.

మోహిని.—(సాసూయముగా) గర్వితులలక్షణమే యిది. పూర్తిగా వినకయే సర్వమెఱింగితి మనుకొనుట.

సాగరిక.—పోనీ ఆపైసంగతి చెప్పు.

మోహిని.—నే నాసపత్నులిచ్చటికి వచ్చుటకు సమ్మతింపక "వారు వచ్చిన నాకు లజ్జగా నుండు ననియు, నేను భర్తృరసావేశముగాఁ బాడనేర" ననియుఁ, జెప్పితిని. అట్లయిన వారలను బిలిపింప ననియుఁ, దాను భోజనమైనవెంటనే వత్తు ననియుఁ, జెప్పి మహారాజు వెళ్లిపోయెను.

సాగరిక.—వ్రతాచరణ కనుకూలముగ మీరు ప్రొద్దు వుచ్చఁ దలచుకొన్నప్పుడు వారల నేల రావింపవలదంటివమ్మా? నీప్రయత్నమునకు వా రేమి యడ్డము?

మోహిని.—నెచ్చెలీ, ఇంతే కద నీ తెలివి? నాసపత్నులసంగతి నీవు గ్రహింపనేరవైతివి. వారు రాజుగారు నాయం దత్యంతమోహమున నున్నారని విరక్తలై జోగురాండ్రై రనుకొంటివే, వారి శీలసంపద గ్రహింపనేర వయితివి. వా రీకారణంబున విరాగిణులు కాలేదు. వా రందఱు మహాజ్ఞానసంపన్నలు, పతివ్రతాశిరోమణులు, పరమపుణ్యశీలలు. అట్టివా రుండుట నాప్రయత్నమునకు భంగముగా నుండును. వారి యెదుట విషయాసక్తి నటించుచుఁ గామక్రీడకు రాజేంద్రునిఁ బురికొల్పుటకు నాకు లజ్జగా నుండదా? అందున నేకాంతగోష్ఠి గోరితిని.

సాగరిక.—(ఆశ్చర్యముతో) గట్టిదానవమ్మా! నీవు పుట్టి కొన్ని పుట్టక కొన్ని నేర్చిన దానవు. మంచితంత్రమే పన్నినావు.

మోహిని.—ఈరాజేంద్రుఁడు వ్రతమండపమునకుఁ బూర్వమర్యాదచొప్పున రాకపోవుట శంకించి, వారు ఈయనను హెచ్చరిక చేయుటకిట వచ్చినను వత్తురు. కావున నీవు పోయి ద్వారపాలకులతో నాయుత్తరువు లేక నాసవతులను గాని, వారిపరిచారికలను గాని, లోనికి రానీయఁగూడ దని చెప్పి రమ్ము. నాకు సహకారిణివై నాప్రయత్నము సఫలము చేయుటకు నేను మన్మథునిఁ బూజసేయుచుందును. తదుచితపూజాపరికరము లన్నియుం దీసికొని రమ్ము.

ఇది మిశ్రవిష్కంభము.



# రుక్మాంగద నాటకము.

పంచమాంకము.

[సంధ్యావళీదేవి, పుణ్యశీల, సాధుమతి, మున్నగు రాజభార్యలు ప్రవేశింతురు. ఇందీవరిక, సాగరిక, యనుపనికత్తె లుపచరింతురు].

సంధ్యావళి.—గౌరీసహస్రనామార్చన ముగిసినది. ఇంక మంగళారాత్రిక నొసంగుదము. ప్రాణనాథుండు మనలను జాగరంబునకై వ్రతమండపమునకుం దోడ్కొని పోవుటకు వచ్చుసమయ మైనది. చెల్లెలా, పుణ్యశీలా! హారతిపాట పాడ నారంభింపుండు.

పుణ్యశీల—ఇందీవరికా! ముత్తెములును రతనములును జొట్టుపేర్చి నడుమం బచ్చకప్పురము ప్రోవిడిన హారతిపళ్లెర మల్లదిగో, ఇటకుం గొనితెమ్ము.

[ఇందీవరిక తెచ్చియిచ్చును.

[పళ్లెర మందుకొని యందఱు పాడుదురు.

మంగళము హిమశైల పుంగవుని నందనకు
మంగళము భక్తమందారలతకు,
అంగజుని దర్పమును భంగపఱిచినదేవ
పుంగవుని సామేన పొంగారుసతికి. జయమంగళం, నిత్యశుభమంగళం. 1.
సకలకల్యాణములు సదయాంతరంగ యై
సకలభక్తుల కిచ్చు సర్వమంగళకుం,
ప్రకృతిబంధముం బాపి పరమసుజ్ఞానమును
సుకృతులకు దయ నొసంగు సుందరికిని. జయమంగళం, నిత్యశుభమంగళం. 2.
ఆపదలు వాపి భద్రాయురారోగ్యములు
మాపతికి సమకూర్చు। మహితాత్మకు,
మాపట్టిధర్మైకమార్గమున నెలకొల్పి
చేపట్టికాపాడు చిచ్ఛక్తికి. జయమంగళం, నిత్యశుభమంగళం. 3.

[హారతి నందఱు కనుల కద్దుకొని గౌరీదేవిపాదములకడ నిల్పి కూర్చుండురు.

సంధ్యా.—ఇందీవరికా! హారతిపళ్లెరములోని ముత్తెములును రతనములును ముత్తై

దువులకు నిలువరుసను బంచియిచ్చి వారి నందఱను జాగరణమునకు వ్రతమండపమునకు రా వేఁడితి నని నామాటఁగాఁ జెప్పి రమ్ము.

ఇందీ.— చిత్తం. రతనములును ముత్తెములును విడివిడిగా మూటకట్టుకొని ; [స్వగతము] భగవంతుఁడు ముత్తైదల కిలాంటి వెలగల వస్తువులని యిచ్చుకోడానికి తగినంత అయిశ్వర్యం నాకియ్యకపోయినా ఇలాంటి పుణ్యాత్ముల సేవకురాలుగా నుండేలాగనా నా నొస్ట వ్రాసినాడు. అంతేచాలును. ఈరతనాలు ముత్యాలు క్రమంగా ముత్తైదువులకు పంచిపెట్టి దండం పెట్టుతాను. నాకుమాత్రం కొంత సుకృతం లబించక పోతుందా; రతనాలనుమాత్రమేనా, రతన్నాలు పోసినతట్టనుమాత్రం గౌరవించడం లేదా. ఈ రాణీలకు మాత్రమేగాక నాకున్ను ఆశీర్వచనం కల్గుతుంది ఆ ముత్తైదలవల్ల.

[నిష్క్రమించును.

సంధ్యా.—ప్రాణవల్లభుఁడు మనలను వ్రతమండపమునకుఁ దోడ్కొనిపోవ సమయము కావచ్చెను. చెల్లెలా పుణ్యశీలా, మీరందఱును సిద్ధపడుఁడు.

పుణ్యా.—(లేచి)అక్కగారూ! మాకు ప్రత్యక్షగౌరి వైన తమ పాదములకు నమస్కరించుచున్నాను.

సంధ్యా.— (లేవఁ దీసి కౌఁగిలించుకొని) నిత్యమంగళము పచ్చతోరణముగా దీర్ఘ సుమంగళివై వర్ధిల్లుము.

[తక్కినవారును అట్లే నమస్కరించుచున్నారు.

[సంధ్యావళీదేవి యాశీర్వదించును.

పుణ్యా.— అక్కగారూ! మోహినీదేవికూడ మనతోడఁ గలిసి గౌరీపూజచేయ రాదా? మీపాదసేవ చేసిన జన్మజన్మములయందు చేసినపాపము నశించును.

సాధుమతి.—సరి సరి, చిన్నక్కా! ఆమెకు గౌరీపూజ, పెద్దలసాంగత్యమును కావలయునా? ఆమె బ్రహ్మమానసపుత్త్రి యని యందురేకాని, కేవలము పామరురాలు. ఆమెమూలమున నార్యపుత్త్రులుకూడ సదాచారము లుపేక్షసేయుచున్నారు. లోకములో ననేకులను గాఢానురాగబద్ధు లయినదంపతులను జూచితిమి కాని, యిట్టి విషయాసక్తి నెక్కడనుం జూడలేదు.

గీ. ప్రాణనాయకుండు పటుమోహావివశుఁడై,
మిగుల నాదరించు మగువ లెందు
లేరె! పతికి నిట్లు లీలారతాత్మయై,
ధర్మహానిసేయు తరుణి గలదె! 2.

పుణ్యా.—చెల్లెలా, సాధుమతీ! అట్లు చేసినట్లయిన, కులసతికిని భోగసతికిని భేద మే ముండును?

క. తొలిజనిఁ జేసినపుణ్యము
ఫలమున ననుకూలుఁ డైనపతిగలిగినఁ గే
వలభోగపరాయణమతి
మెలఁగుట గులసతికిఁ దగునె? మెత్తురె దానిన్? 3.

లోకుల మెప్పుమాట యటుండనిమ్ము. మనుష్యజన్మ మెత్తినందునకుఁ గొంచెమైన సుకృతంబు సంపాదించుకొన నక్కఱలేదా? మగనాలికి స్వతంత్రముగ నేపుణ్యకర్మలు చేయుటకు నధికార మెక్కడిది? మనకు పుణ్యము సంపాదించుకొనుటకు నొక్కటే మార్గము గలదు. అది యెద్ది యనిన, భర్తను నిత్యము పుణ్యకార్యములకుఁ బురికొల్పుచు నిరంతరము ధర్మము దొలఁగి చరింపకుండఁ బ్రబోధించుచుండుటయే. అక్కగారూ! పూర్వ మొకతటి నా కిట్లుగదా మీరు బోధించితిరి.

క. పతి సేయు పుణ్యకర్మ
ప్రతతిని గాపాడి ధర్మపథమున నిలుపుం
బతి నేసతి నామె గొనున్
బతిపుణ్యమునందు సగముఁ, బడయును శుభముల్. 4.

సాధు.— ఒకవంక నామె ఆర్యపుత్త్రిల సదాచారముల కన్నిటికి భంగము సేయుచు నిరంతర క్రీడాసక్తి మెలంగుచుండ, మీ రేమో, పతిసేయు ధర్మకార్యప్రతతిని గాపాడి ధర్మపథమున నిలుపుట కులసతి లక్షణ మని చెప్పుచున్నారు? బాగుగానే యున్నది!

సంధ్యా.— తోఁబుట్టువులారా! ఉద్వేగ మందకుఁడు. శాంతి సర్వవిధముల శ్రేయోదాయకము.

పరస్పరంబుఁ గూర్మిఁ బేర్మిఁ బరఁగు దంపతుల్నిరం
తరంబు జోడు గూడి ఖేలనములఁ జొక్కుచున్ జరిం
తు రెందు; నైజ మద్ది; యిట్లు దుడుకుఁ జెంది మోహినీ
సరోజపత్త్రనేత్ర నింద సలుప మీకుఁ బాడియే. 5.

నవయౌవనసముత్కంఠ యగుటంజేసి మోహినీదేవియు, నా మెయందలి వలపు పొలపునం జేసి యార్యపుత్త్రిలును,నొండొరుల నెడఁబాయలేక దివసముల నిమిసములుగఁ

గడపుచున్నారు. ఇం దేమివింత గలదు! కాలక్రమంబున వారే మఱల సదాచారపరులు కాఁగలరు. ఈవిధంబునఁ దాల్మిఁ దూలి నామెను నిందించిన నార్యపుత్త్రిల యాగ్రహంబునకుఁ బాత్రముల మగుదుము.

సాధు.—అక్కగారూ! తమ శాంతికి మితియే లేదు. ఎంతకాలము తమ పాద సేవచేసినను మా కొక్కవీసముభాగమైన తమ సుగుణసంపద యబ్బకున్నది.

పుణ్యా.—అక్కగారూ! ఇన్నినాళ్లవలె నార్యపుత్త్రిలు శ్రీహరివాసరవ్రత జాగరణంబునకు వ్రతమండపమునకు మనలం దోడ్కొనిపోవుటకు ఇంకను రారైరి. కారణమే మైయుండునో!

సాధు.—ఇంతసేపటి నుండియు నన్నావిచారమే గలంచుచున్నది. దేవి సన్నిధిలోని దీపారాధన కాంతి తఱఁగి యున్నది.

క. వలక న్నదరెడు మాటికిఁ,
గలవరపా టొందె మనము, గన్పట్టె నమం
గళశకునమ్ములు, ప్రాణే
శుల పదపద్మములసేవ చొప్పడ దింకన్. 6.

ఆర్యపుత్త్రిలు వ్రతమండపమునకు మనలం దోడ్కొనిపోవుట కరుదెంచు వేళ చాల నతిక్రమించినది.

పుణ్యా.—అక్కగారూ! ఈ యమంగళశకునమ్ములకు శాంతి చేయింపుఁడు. చిరంజీవి విద్యాగురువును తాపసవర్యునిఁ బలిపించి శాంతిచేయించుట లెస్సగదా, ఆమహానుభావుని రప్పింపుఁడు.

సంధ్యా.—తోఁబుట్టువులారా! నేఁడేలొకో చిరంజీవిని జేర్కొనినంతనె నామనము తల్లడ మందుచున్నది.

సాధు.— అక్కగారూ! చిరంజీవిని దాపసవర్యుని బిలుచుకొనివచ్చుటకుఁ జతురిక నంపుదమా?

సంధ్యా.—అట్లు చేయుదము. చతురికా! నీవు సత్వరమ్ముగఁ బోయి, చిరంజీవిని వెంటఁబెట్టుకొని వచ్చి మాకు వారిదర్శనము ప్రసాదింపవేఁడితి మని, తాపసవర్యులతో మాకోరికగా విన్నపించి రమ్ము. [చతురిక వెళ్లును.

సంధ్యా.— తోఁబుట్టువులారా! ఆర్యపుత్త్రిలు నేఁ డింతవఱకు రాకుండుటం బట్టియు నీదుశ్శకునమ్ములచేతను నాడెందము గొందల మందుచున్నది. తచ్ఛాంతికై యార్త త్రాణపరాయణుం డగు నాశ్రీహరిం గూర్చి ధ్యానము చేయుదము రండు.

[అందఱు లోనికరుగుదురు.

[ధర్మాంగదుఁడును, దాపసుఁడును బ్రవేశింతురు].

ధర్మాంగదుఁడు.— గురువర్యా! మన మిచ్చటి కరుదెంచునపుడు హజారమున కెదుట భజనశాలయందు జనస్తోమము చుట్టుచేరి వినుచుండ నధ్యాత్మవిద్యావిషయములం గూర్చి యుపన్యసించుచున్న యీ మహానుభావు లెవరు?

తాపసుఁడు.—వత్సా! వారు తత్త్వజ్ఞానసంపన్నులు. అజ్ఞానసాగరమగ్నులై పరబ్రహ్మస్వరూపం బెఱుంగనేరక పామరత్వంబున నైహికసుఖంబులనే కోరుచుఁ గామక్రోధాదులచేఁ బ్రేరితులై సంచరించు భూజనులకు జ్ఞానోపదేశమ్ము సేయుచు జగదుద్ధరణపరాయణాత్ములై సంచరించు మహాత్ములు.

ధర్మా.— మహాత్మా! యుష్మద్బోధామృతాస్వాదన ప్రభావంబున సందీప్తవిజ్ఞానుండనై తపశ్చరణంబునకై వనంబున కేఁగవలయు ననుకోరిక దిన దిన మభివృద్ధి యగుచుండెను. ఈ మహాత్ములవలనను నట్టులే వింటిని. నే నట్లు చేయుటకు నెప్పు డర్హుఁడ నయ్యెదను, గురువర్యా?

తాప.— వత్సా! జగంబున ధర్మసంస్థాపనంబుచేసి భూప్రజల కైహికాముష్మిక సుఖంబుల సమకూర్చి జగం బుద్ధరింపఁ దగు సార్వభౌముండవై జన్మించిన నీకుఁ దపశ్చరణ మేల?

చ. వనములఁ గంద మూలముల వాయు జలంబుల నారగించి, యెం
డను జలి గాడ్పునం దనువు డస్సి కృశింపఁ దపం బొనర్పఁగాఁ
గన నగునట్టి సత్ఫలముకంటెను వేయుమడుంగు లెక్కుడౌ
ఘన సుకృతంబుఁ గాంచును జగత్పరిరక్షణ దక్షుఁ డారయన్. 7.

ధర్మా.—మహానుభావా! నిస్సంగత్వమునఁ గాని నిర్మోహత్వమును, నిర్మోహత్వమునఁగాని నిశ్చలతత్త్వంబును, నిశ్చలతత్త్వంబునంగాని జీవన్ముక్తియుఁ, గలుగదనిక దా యార్యోక్తి?

తాప.—ఆవాక్యము సత్యమే. అట్లే ముక్తి లభించును. నిస్సంగత్వమనఁగా సకలజనులను విడిచి నిర్జనవనంబున కేఁగి తప మాచరించుట యని తలంచితివి కాఁబోలు. అట్లు కాదు.

గీ. ఆత్మమోక్షణార్థి యై యెల్లజనులను
వదలి, తపముసేయు టదియు సూక్ష్మ
బుద్ధి నరయ భేద బుద్ధ్యహంకారత
త్త్వములఁ దెలుపు; ముక్తి దానఁ గలదె. 8.

కేవలనిస్సంగత్వము జగదుద్ధరణపరాయణత్వము. అది పరమార్థము.

గీ. తన్ను మఱచి జగమె తానుగా భావించి
జగము నుద్ధరించుసజ్జనుండు
వేగ పడయు ముక్తి; వివరింపఁగా మమ
కారనాశనంబ కాదె ముక్తి? 9.

ధర్మా.— గురువర్యా! తమ యనుగ్రహంబున సకలజ్ఞానసారమును దెలిసికొన నేర్చితిని. తమప్రబోధంబె చేయూఁతగ నింకమీఁద జగదుద్ధరణపరాయణుండనై మెలంగి కడతేఱఁ బ్రయత్నించెద.

తాప.—వత్సా! మీతల్లిగారి మందిరమున కరుదెంచితిమి.

[లోపలఁ బ్రవేశించుట నభినయింతురు.

ధర్మా.— [నల్గడలఁ బరికించి] ప్రతీహారీ! మా యమ్మగా రెక్కడ? వ్రతమండపమ్మున కేఁగిరా?

ప్రతీహారి.—లేదు బాబయ్యగారూ! లోపలనే యున్నారు. దేవుడి మందిరము లోకి వెళ్లి చూడండి.

ధర్మా.— తాపసోత్తమా! అచ్చటి కరుగుదమా, పురోభాగమునందే యున్నది ఆ మందిరము.

తాప.—అట్లే కానిమ్ము వత్సా! [అని పరిక్రమింతురు.

ధర్మాం.—గురువర్యా! మా తల్లు లందఱు గలిసి పూజసేసికొనుచున్నారు. వీరి యన్యోన్యానురాగంబు నా కెంతయుఁ బ్రమోదావహము.

తాప.—నాయనా! వీరు మహాపతివ్రతలు. నిష్కళంకమానసలు. పరమపుణ్య శీలలు.

చ. పతి కెదురాడ రెప్పుడును, భర్తయె దైవముగాఁ దలంచి ని
శ్చితమతి గొల్తు రాయననుఁ, జిత్తము నొవ్వగఁ జేయ రెప్పుడున్,
సతతము దేవభూసురగణంబుల గొల్తురు, బంధుకోటి నం
చితగతి సత్కరింపుదురు, సేయుదు రాదర మాశ్రితాళికిన్. 10.

క. పరుషోక్తుల నాడరు, ద
బ్బరలు వచింపరు, మెలఁగరు పరనిందాలా

పరతిఁ, దీనజనంబుల
నరయుదురు, నిరంతరమ్ము సాదరమతు లై. 11.

వత్సా! తదేకాగ్రబుద్ధిగా ధ్యానముచేయుచున్నారు. మనము వారి ధ్యానమునకు భంగము సేయనేల? ఇచ్చటఁ గూర్చుండి వారి పూజాసమాప్తి నిరీక్షింతము.

ధర్మాం.—చిత్తము. [ఇద్దఱు మందిరప్రాంగణమునఁ గూర్చుండురు.

సంధ్యా.—తోఁబుట్టువులారా! శ్రీహరికి హారతిపాట పాడుఁడు.

[అందఱు పాడుదురు.

(గేయము).

శ్రీరమానాయకా శ్రితజనమందార
సారవిజ్ఞానభాస్వచ్ఛుభాకార.
అజ్ఞాననిబిడమోహాంధకారదినేశ
ప్రజ్ఞానదాయకా బహుళ పాపవినాశ. జయ జయ.
యోగవిద్యాగమ్య యుపనిషన్మయమూర్తి
రాగాదివిరహిత రమ్య తేజఃస్ఫూర్తి.
మాప్రాణవల్లభు మాకూర్మిపట్టి
నీప్రాపుదయచేసి నెమ్మిఁ జేపట్టి. జయ జయ.
కాపాడరావయ్య కరుణాలతో వాల
యేపారుభక్తితో నెపుడు నీపాదాల.
శ్రీహరీ గొల్తుము సేయకయ్య పరాకు
జోహారు జోహారు జోహారిదే నీకు. జయ జయ. 12.

[హారతి కన్నుల నద్దుకొని, వందప్రణామము చేసి, వెలుపలికి వత్తురు.

సంధ్యా.—(ధర్మాంగదునిఁ దాపసుని వీక్షించి) తాపసోత్తమా! తాము ఇచ్చటికి విజయముచేసి తడవయ్యెనా? నేఁడు మంగళకళనములు మెండుగఁ దోఁచుచుండుటం జేసి, ఆపన్నివారకుం డగు నా శ్రీహరిని మంగళార్థము ధ్యానించుచుంటిమి.

[అందఱు తాపసునకు వందనం బాచరింతురు.

తాప.—నారాయణ, నారాయణ, పాపశాంతి యగుఁగాక.

[ధర్మాంగదుఁడు, తల్లుల కండలికిఁ బ్రణమిల్లును.

అందఱును.—దీర్ఘాయువ వై వంశపావనుండవు గమ్ము.

పుణ్యా.—నాయనా! ఇటు రమ్ము. తాపసోత్తమా! ఈ ముద్దుఁగుఱ్ఱని మాచెంతఁ గూర్చుండఁ బెట్టుకొనెదము.

[ధర్మాంగదునిఁ జెంతకుఁ బిలిచి యందఱు ముద్దులాడుదురు.

సంధ్యా.—తాపసవర్యా! తమశిష్యుఁడు బుద్ధిశాలియై వినయశీలుఁడై విద్య నభ్యసించుచున్నాఁడా? [అనుచు ధర్మాంగదునిఁ జేరఁదీసి ముద్దాడును.

తాప.—అమ్మా! శుక్తిగర్భమున ముత్తెము పుట్టు టొక యబ్బురమా? పూర్వసంస్కారమునను పిత్రార్జితవిజ్ఞానవాసనావిశేషంబునను నీబాలుఁడు సకలశాస్త్రముల నచిరకాలంబుననే గ్రహించినాఁడు.

సంధ్యా.—తమ శుశ్రూషాప్రభావము మహానుభావా! (నిశ్వసించి) ఏమి యీ చిత్రము! ఈబాలకునిస్పర్శమాత్రంబున నామేను కంప మంది చిత్తముతల్లడ మందుచున్నది; తాపసోత్తమా!

క. మాచిత్తము లేలొకో సం
కోచస్థితిఁ జెంది మిగులఁ గొందల మందెన్?
ఏచె నమంగళశకునము
లేచేటు ఘటిల్లఁగలదొ యెఱుఁగము తండ్రీ! 13.

ప్రమాదవశంబున నేమి పాపముఁ జేసితిమోగాని, బుద్ధిపూర్వకముగ నేపాపమును జేయలేదు.

క. గురుఁడుగ దైవముగ నిరం
తరమ్ము గొల్చెదము ప్రాణనాయకు భక్తిన్,
దురితాత్ములకును బలె నీ
పరిణతి మాకేల గల్గె సంతాప మెదన్? 14.

గీ. ప్రాణనాయకుఁ, డరయంగఁ బంకజాక్షు
భక్తలోకావతంసుఁ, డాపరమపురుషు
పాదకమలంబు లకలంకభక్తియుక్తిఁ
గొలుచు మాకెట్టిపాపంబు గలుగఁగలదు? 15.

తాప.—[ఆత్మగతము] భళిభళి, వీరుగదా పతివ్రతాశిరోమణులు. వీరి యంతఃకరణశుద్ధి యెంత యని వర్ణింపవచ్చును! ఇట్టి దృఢవిశ్వాసముతోఁ బతిభక్తి సలుపు వీరికిఁ బాపమాలిన్య మెట్లంటును. [ప్రకాశము] సాధ్వీమణులారా! మీరు పాపరహితలు,

లోకపావనచరిత్రలు. మీ కేయశుభంబును గలుగదు.

సంధ్యా.—తాపసోత్తమా! మా కిట్లు చిత్తక్షోభము కలుగ నేల?

తాప.—(విస్మయముతో) నాకునుం జిత్తక్షోభము కలుగుచున్నది. నిస్సంగుండ నగు నాకిట్టి చిత్తక్షోభము కలుగ నేల? అహో, పాపజనకం బైనవిపరీత మెద్దియో కలుగనై యున్నది కాంబోలు. కావున నే వీరికిని నాకును నేకకాలమందే చిత్తక్షోభము కలిగినది. సాధ్వీమణులారా! మీ కేయశుభంబును గలుగదు. లోకమున ధర్మహాని యగు వింత యెద్దియో కలుగ నై యున్నది. ఆకారణంబున మీ మనంబులు సంతాపభాజనము లైనవికాని వేఱుకారణంబునం గాదు.

క. భూతదయాపరిపూరిత
చేతసులకుం గలుగుచుండు చిత్తక్షోభం
బాతతముగ, నిల ధర్మవి
ఘాతం బగువింతపుట్టుకాలములందున్. 16.

[పాపశాంతి యగుంగాక, పాపశాంతి యగుంగాక.

సంధ్యా.—తాపసోత్తమా! తమ వచనములు మాకు భయావహములుగా నున్నవి. అయినను ఆర్యపుత్రులు నేం డింతప్రొద్దుపోయియు వ్రతమండపమునకు మమ్ముం దోడ్కొనిపోవుట కిచ్చటికి విజయము చేయరైరి. చెల్లెలా! పుణ్యశీలా! ప్రాణనాయకుల వార్త యరయంబోయిన చతురిక యింకను రాలేదా?

[చతురిక ప్రవేశించును].

పుణ్యా.—చతురికా! ఇంత తడవేల చేసితివే?

చతు.—అమ్మా! నే చేసిన ఆలస్యం యేమీ లేదు. మోహినీదేవిగారీవేళ యెవ్వరినీ లోపలికి రానీయవద్దన్నా రనిచెప్పి లోపలికి పోనియ్యలేదు ద్వారపాలకులు.

సాధు.—మోహినీదేవి సెలవెందులకు? ఎచ్చట నున్నారు ప్రాణనాయకులు?

చతు.—మొదట రాజుగారి మందిరానికే పోయినాను. వా రక్కడ లేకపోతే తర్వాత అక్కణ్నుంచి మోహినీదేవిగారి యంతఃపురంలో వున్నారంటే అక్కడికి వెళ్లాను. అక్కడ ఆమెగారి ద్వారపాలకులే నన్నడ్డగించారు. తమరందరు రాజుగారి వర్తమానం తెలుసుకొని రమ్మన్నా రని నేను లోపలికి వెళ్లాలని రాజుగారిని చూచిరావల్లని శానాసేపు పోట్లాడాను. వల్లకాదని పోనిచ్చారుకారు.

పుణ్య.—అక్కగారూ! ఆ మోహిని మంచిది కాదని మేమనిన మీరు మమ్మును గోపము చేసితిరి. చూచితిరా ఆమె దౌష్ట్యము.

సంధ్యా.—ఏమిచేయుచున్నారే ప్రాణనాయకు లచట?

చతు.—మోహినీదేవిగారున్ను వారున్ను కలిసి భజనచేస్తున్నారట.

సంధ్యా.—తాపసోత్తమా! దుశ్శకునముల ఫల మిప్పుడే కనిపించినది కదా? మా ప్రాణేశ్వరు లింక మాకు వారిపాదసేవ నయితము ప్రసాదింపరు కాఁబోలు. ఆ మోహినీదేవి మాపరిచారికల నైన ఆప్రాంతములకు రానియ్యలేదఁట తాపసోత్తమా. ఇఁక మాగతి యేమి? మే మెంతమందభాగ్యల మైతిమి!

క. వ్రత మాచరింప నైనను
పతి మాకై దెలుపఁడయ్యెఁ, బతి దయ దప్పెన్;
బ్రతు కేల యింక మాకున్?
గతి గలదే పతిఁ ద్యజించు కాంతల కిలలోన్. 17.

తాప.—సాధ్వీమణులారా! మీరు వగవకుఁడు. మీలో నెవ్వరియెడల నైనఁ గిమ్మకవోడమి మోహినీదేవి యట్టి యుత్తరువు చేసెనేమో? ఆమె కట్టి యాగ్రహము కలుగునట్లు మీ రెవ్వరేని నిష్ఠురము లాడితిరా? మీపతికి మీయెడఁ దప్పుటకు గారణమేత ముండును?

సాధుమతి.—తాపసవర్యా! అక్కగా రామెను దన కన్నబిడ్డవలె నత్యంతవాత్సల్యంబున నాదరింతురు. మే మెవ్వరము నిందింపలేదు.

ఉ. తాపసవర్య, మీయడుగుఁదమ్ములయాన వచింతు సత్యమున్,
మాపతి మోహినీసతిని మ మ్మెడఁబెట్టి వరించి సంతతం
బాపెకె గూర్చు నం చలుగ మాత్మ వచింపము కోపనిష్ఠురా
లాపము లాదరింతు మనయంబును జెల్లెలిరీతిఁ గూరిమిన్. 18.

ఇది యకారణవైరము. మాపైఁ గొండెములుచెప్పి మా ప్రాణనాయకుని హృదయంబునఁ గోపము పుట్టించెం గాఁబోలు.

తాప.—అమ్మలారా! దాసీజనంబు లెవ్వరైనమీమీఁదఁ గొండెములుచెప్పి మోహినీదేవికి మీయెడఁ గోపము పుట్టించిరేమో, మీరు చింతింపకుఁడు. అకారణవైరము చిరకాల ముండఁజాలదు.

సంధ్యా.—తోఁబుట్టువులారా! మనపట్ల నామెకు గోపమున్నను నుండుఁగాక, మన కేల ఆపెయెడఁ గినుక. ఈమహావ్రతము ప్రాణనాయకు లామెమందిరంబుననే యాచరింపఁ దలఁచిరేమో, మనమును గొంకులేక యిప్పటికే పోయి జీవితేశ్వరుల పాదసేవ సేసి వారితోడ నప్పుటనే వ్రత మాచరింతము. తాపసవర్యా! ఇది లెస్సగదా?

తాప.—అందున కాక్షేపమేమి?

సంధ్యా.—చతురికా! ప్రాణనాథులు వ్రతమంటపమునకు విజయము చేసిరో లేక యీ మోహినీదేవి మందిరముననే యున్నారో విచారించి రమ్ము.

[చతురిక నిష్క్రమించును.

[ఇంతలోఁ బురోహితుఁడు ప్రవేశించును.]

పురో.—మోహినీదేవి తప్ప రాజపత్ను లందఱు నిచ్చటనే యున్నారు. రాజుగారింకను భజనమండపమునకు రాలేదు. (సమీపించి) బాబుగారును ఇక్కడే ఉన్నారు. ఆహా, తాపసేంద్రులు కూడ ఉన్నారేగా. తాపసోత్తమా! వందనము.

రాజపత్నులు.—ఓహో, పురోహితులు! దండము, దండము, ఆత్రేయులవారూ.

పురో.—దీర్ఘసుమఙ్గళీభవ. భజనమడపంలో స్వామివారికి సహస్రనామార్చన చేయువేళ అయినది. ఊరిల్లోని జనులు అందఱునువచ్చినారు. మీరు రాలేదని కనుంగొన వచ్చినాఁడను.

సంధ్యా.—ప్రాణనాయకులు విజయము చేసిరా?

పురో.—వారు ఇంకను విజయముచేయలేదు. మోహినీదేవిగారి మందిరములో ఉన్నారఁట. వారికి సహస్రనామార్చన సమయమైన దని విన్నపము చేయ నేను పోఁబోగా నన్నా ద్వారపాలకులు పోనిచ్చినారుకారు.

సంధ్యా.—తాపసోత్తమా! ఇదేమి వింత! ఆత్రేయులవారినిసైతము లోపలికిఁ బోనియ్య లేదఁట.

ధర్మాం.—అమ్మా! నాయనగారు సహస్రనామార్చనవిషయమై పరాకుపడిరేమో మోహినీదేవిగారిపాట వినుచు.

తాప.—అంతయు విమర్శించిచూడ నా కొక్కశంక గలుగుచున్నది. మోహినీదేవి వచ్చినదిమొద లామెసడవడి వింతగానే యున్నది. ఈ రాజేంద్రుఁ డామె వలపునం బడి సదాచారవిముఖుఁ డగుచున్నాఁడు. వారు వ్రతముమాటయే మఱచిపోయిరేమో, అట్లయిన నెవ్వరిని లోనికి విడువవల దని ద్వారపాలకుల కుత్తరువు సేయ నేల? ఇదేమో కపటోపాయముగా నున్నది. వ్రతభంగముచేసి యీ రాజేంద్రుని భోగపరాయణాత్మునిఁ జేయుటకు మోహినీదేవి యీయుపాయము చేసియుండనోపు. వ్రత మాచరించుచు భజనసేయుచుండినట్టియున నేకాంతరహస్యగోష్ఠి యేల? ఇది యొకగూఢతంత్రమే. ఈవ్రతము విఘ్నమందకుండ సంరక్షించుట కర్తవ్యము. ఇందున కేమిసాధనము? ఆమె వన్నినతంత్రము సమగ్రముగఁ దెలిసికొనిగదా ప్రతివిధానము చేయవలయు. (ఆలోచించి) కామరూపధారినై మోహినీదేవి మందిరముసొచ్చి యామె తంత్రమంతయు సమగ్రముగాఁ దెలిసికొనియెద. అహో, స్త్రీల యంతఃపురము సొచ్చి వారిరహస్యము లరయుట పాపము కదా? ఈ మహావ్రత ముద్ధరించుట లోకమునకు మహోపకారము గదా. ఇట్లు వెనుకముం దాడ నేల?

తే. అంటునేని పాప మంటుఁగా క్రీవత
ముద్ధరించు శ్రీమన్మోహ రాజితంబు;
అత్తరతుణంబు నరయఁ బిపీలికా
ద్యఖిల చేతనంబు లదిఘునంబె?

ఇఁక నేను సత్వరముగా నిటనుండి తరలెదను. సాధ్వీమణులారా! ఇఁక నేఁ బోయి వచ్చెదను. వత్సా! నీవు మీ తల్లుల శుశ్రూషఁ జేయుచు, మీతండ్రిగారు వచ్చునంతకు నిచ్చట నే యుండుము. [రాజపత్నులు ప్రణామము చేయుదురు.

తాప.—సౌభాగ్యవతులు, నారాయణ, దీర్ఘసుమంగలీ భవ. [అని నిష్క్రమించును.

సంధ్యా.—తోఁబుట్టువులారా! మోహినీదేవి మనకు వార్త నంపక తనమందిర మున నే వ్రత మాచరించుచున్నదను నీర్ష్య మనకేల? ఆర్యపుత్త్రుల పాదసేవకొఱకు మనమే యచ్చటికిఁ బోదము. మీరు నాయుత్తముగ రండు.

చత.—(ప్రవేశించి, తనలో) ఎందుకు నేను చెప్పుతుందడం? వీరంతా అక్కడి కొచ్చి అవమానం పడ్తున్నారు, అప్పుడే యెందుకు చెప్పావని కాంటారు. (ప్రకాశముగా) అమ్మలారా! మీరంతా అక్కడికి పోతున్నామంటున్నారుగాని మిమ్మల్ని లోపలికి పోనివ్వదు. తన సవతులు మరి కెవ్వరికీ తెలుసుగాని, యెవ్వరినీ లోపలికి రానివ్వవద్దని స్పష్టంగా ఉత్తర్వు చేసింది మోహిని.

సంధ్యా.—(సవిచారము) ఇంకేల? వ్రతముచేయుట మానివేసినారు కాఁబోలు. కాకున్న నింతరహస్యగోష్ఠి యేల? అయ్యో, ఎంతపాపము! ఎంతపాపము!

పుణ్య.—అక్కగారూ! ఈ పాపిష్ఠ మోహిని యెక్కడనుండి వచ్చినదమ్మా? ఆర్యపుత్త్రుల వ్రతమునకు విఘ్నము చేయును గాఁబోలు నీదుర్మార్గురాలు. వ్రతభంగము కాకుండు నెరవు నాలోచింపవమ్మా.

సంధ్యా.—ఈమోహినీదేవి యిట్టి ధర్మవిఘాత మైనపని చేయుటకు సమకట్టిన దని తాపసవర్యులప్పుడే తెలిసికొనియే మనతో నట్లు పలికిరి. ఇట్టి విపరీతము పొసంగకుండ రక్షింప శ్రీహరినిగూర్చి ధ్యానము సేయుదము రండు. ఇట్టి విపత్తు తొలఁగింప నాయనయే సమర్థుఁడుగాని మన మేమి చేయఁగలము? [అందఱు నిష్క్రమింతురు.

# షష్ఠాంకము.

స్థలము. మోహినీదేవియంతఃపురము, నీలాశ్మసౌధము.

[భక్తి రసావేశంబున వీణవాయించుచుఁ బాడుచు మోహినియు నానందపరవశుండై యాలకించుచు రుక్మాంగదుఁడును ప్రవేశింతురు.]

మోహిని.—ఆర్యపుత్త్రా, ఏమో కొంచెము నాచేత నైనట్లు పాడితిని. అనేక మహా విద్వాంసుల పాట వినుచుండు మీ కేపాటి రంజకముగా నుండును నాపాట?

రుక్మాంగ.—ప్రేయసీ, ఏమి నీ వినయగ్గరిమ? అయ్యారే! ఎందఱ పాటనో వింటినిగాని యింత మనోహరమైన పాట నిదివఱకెన్నఁడైన వింటినా? నీపాట సొగసు వర్ణింప నాకుఁ దరమగునా?

క. అమృతము గురిసిన దినమున
సుమసౌరభ మలమినట్లు సుందరి, నీగా
నము చేతోహర మైనను
ప్రమోదరసవార్ధి ముంచి పరవశుఁ జేసెన్. 1.

మ. కలకంఠమ్ములు రాజకీరములు శిక్షాసూర్తిమై పాడు సొం
పలరన్, గానము నల్పనీవు గడుఁ జోద్యమ్మైన చందంబునం;
దలిరుంగైదువుఁజోదు దిగ్విజయయాత్రారూఢిఁ బూరించుకా
హళశంఖధ్వను లంచు యౌవనజనం బాలించు నిర్వేదనన్. 2.

కాంతామణీ, వేయేల? ఇంత మనోహరమైన పాట నిదివఱకెన్నఁడును వినలేదు. అసమానముగదా నీగాన విద్యాకౌశలము. నీబుద్ధి చాతుర్యమునే మెచ్చుకొందునా, నీ సౌందర్య వైభవంబునకే యచ్చెరువందుదునా?

గీ. చంచలాసృష్టిచతురతఁ గాంచనమ్ముఁ
జేయు మెలఁకువ రెంటిని జేర్చి నలువ
నేసెఁ గాకున్న నీదుపసిండిమేను
కలికి మిఱుమిట్లుగొల్పునే కన్నుఁగవకు. 3.

[మోహినిం జేరఁ దివిచి కౌఁగిలించుకొనును.]

మోహిని.—ప్రాణనాయకా, సకల కళావిశారదులును రూపనిర్జితసూనాస్త్రులు నైన మిమ్మును భర్తగాఁ బడసి మీయత్యంతానురాగంబునకు భాజనమై మీచే నిటు లగ్గింపఁబడుట నాతపఃఫలము.

రుక్మాంగ.—ప్రేయసీ, నేనెట్టి యుత్కృష్టమైన తపంబు సేసితినో కదా.

క. నాకంటె ధన్యుఁ డెవ్వఁడు?
రాకా శశిబింబసదృశ రమణీయాస్యా,
నీ కోమలాంగ వల్లరి
నాకౌఁగిటఁ జేర్పఁ గంటి నాధన మయ్యెన్. 4.

[మోమెత్తి ముద్దాడును.

[నేపథ్యమున]

ఈరేత్రిరి తెల్లార్లూ జాగారం శాయా
లిశింది. రే పేకాశి. వుపాసం జాగారం
కూడా శాఁయాల. మరిశి పోకుండి. అట్లాఁ
శేస్తే యెల్తా రంట, శేశినోళ్లు, సొర్గానికి.

రుక్మాంగ.—తిటాలున మోహినిని విడిచి దూరముగా నిలిచి, అపూర్వ మనోహరమైన యీ కాంతామణి పాటచేఁ బరవశుండనై శ్రీహరివాసర వ్రతమే మఱచితిని! ఎంత ప్రమాదమయ్యెను! వ్రతనియమము చెఱుపుకొంటిం గదా? శ్రీహరీ నాతప్పు మన్నింపుము. [కనులు మీఁదికెత్తి చూచుచు ధ్యానించును.

మోహిని.—(తనలో) ఇదేమివింత. ఈచాటింపు చెవిలో నూఁదినట్లు వినిపించినది. రాజవీథిం జాటించిన నింత స్పష్టముగా వినిపించునా? నాచెలికత్తెలు తప్ప మఱెవ్వరును నీయెడ లేరు. ఇది దైవ మాయగానున్నది. ఈ రాజేంద్రుఁ డీచాటింపు విని నాకౌఁగిటికిం దొలంగె. నేనీ చాటింపు విననట్లు నటించి యాయనను మదనక్రీడకుఁ బురికొల్పెదంగాక. (ప్రకాశముగా) ప్రాణనాయకా, ఏమి నీవిలాసము. నీపాలయులకయత్యంత శృంగారరసోత్పాదకమై నన్ను మోహవివశాత్మను జేయుచున్నది. శయ్యా మందిరంబున కేగుదము గమ్ము. (బిటారఁ బోయి కౌఁగిలించుకొనును).

రుక్మాంగ.—మోహినీ, నన్నంటకుము, నన్నంటకుము.

[కౌఁగిలి విడిపించుకొనును.

చ. అలజడి వెట్టుటేల? నను నంగభవాంబక జాలదీపితా
నల శిఖ నామనంబు జ్వలనం బొనరించెను, దాళఁ జాల; ను
జ్జ్వలకరుణా ప్రపూర్ణమతిఁ జయ్యనఁ గౌఁగిటఁ జేర్చి నన్నుఁ గ్రొం
దలిరుఁగటారిజోదుకదనంబునఁ దేలిచి తాప మార్పవే. 6.

రుక్మాం.—కాంతామణీ! నీకు చాటింపు వినఁబడలేదా? శ్రీ హరివాసరవ్రతము మాట మఱచి యెట్టి దుశ్చరితంబు సేసితిమి. వ్రతమండపమునకుఁ బోవుదము రమ్ము.

మోహి.—చాటింపా? ఏమని? ప్రాణనాయకా! నా కొక్కటియే చాటింపు వినఁబడుచున్నది. నీకంటె రసికుఁడైన మహాపురుషుఁడు జగంబున లేఁడని మన్మథుఁడు చేయు చాటింపు.

రుక్మాం.—ప్రేయసీ! ఇఁక నేఁడు విషయ భోగంబులఁ గూర్చి పలుకకుము. నేఁడు దశమి. రేపు ఏకాదశి. హరివాసరవ్రత మాచరింపుఁ డని చాటించుచున్నారు. ఇంతకు ముందు మన మిద్దఱమును శ్రీ హరివాసర వ్రతనియమ మూని హరినామ సంకీర్తనంబు చేయుచుంటిమి గదా మఱచితివా?

మోహి.—ప్రాణవల్లభా! ఇప్పుడు శ్రీ హరివాసరప్రసక్తి యేల? ఇప్పుడేకదా నన్ను నిండారు కౌఁగిట నుnnించి యత్యంతముగఁ జిత్తజవికారంబు పాలు చేసితివి. ఇంతలో నీ విట్లు వ్రతనియమ మను నెపము కల్పించి యలజడి పెట్టెద వేల? ఇంతకు ముందు లేని నియమ మింతలో వచ్చినదా?

రుక్మాం.—కాంతామణీ! ప్రమాదవశంబున వ్రత నియమము మఱచితిని. కాని యిప్పుడు వినిపించిన చాటింపుచేతఁ బ్రబోధితుండ నైతిని. నిర్వ్యాజకృపాసముద్రుం డగు నా శ్రీహరి యీ చాటింపుచేతఁ బ్రబోధించి పాప పంకంబునఁ బడకుండ మనలం గాపాడినాఁడు. ఇట్లేకదా యా మహానుభావుని కటాక్షవిలసనము ప్రసరించుచుండును.

క. మానవు లరయుఁగ నల్ప
జ్ఞానులు గామాదిశత్రుగణపీడితులం
గాని కృపామతి నీశుఁడు
నానావిధములఁ బ్రబోధనం బొనరించున్. 7.

మోహి.—రాజేంద్రా! నీవు నిక్కముగఁ బొలయలుక యే నటించుచున్నా వని యుత్తరఱకు భీతిమపడితిని గాని, నీ మాటల సరణిఁ జూడ నాయెడ నిక్కముగనే యలుక పొడమి వ్రత మను నెపంబున నా కౌఁగిలిని దలంగి చననెంచి నట్లుగాఁ దోఁచు

చున్నది. కేవలముగ్ధ నైన నాయెడఁ దప్పు పాటింపఁ దగునా? పాటించితిరేనియు నిది యా దండించు విధానము.

క. మగువలు తప్పొనరించినఁ
దగురీతిని బుద్ధిచెప్పఁ దగుగాక; యిటుల్
దగునే మదనక్రీడకు
మగువన్ బురికొల్పి దాని మఱలఁ ద్యజింపన్. 8.

ఈరీతి మిక్కిలి క్రూరము.

రుక్మాం.—ప్రేయసీ! నీవలన తప్పులేదు. నాకు నీయెడఁ గోపమును లేదు. నేఁడును రేపును సకల విషయేచ్ఛల వర్జించి శ్రీహరి వాసర వ్రతము జరుప వలయు.

మోహి.—ఈ యొకనాఁటి కింత మోడియేల? హరివాసరము లింక రావా? అవిచ్ఛిన్నముగ నికమీఁద నా వ్రత మాచరింపఁగూడదా? నన్నుఁ బరిణయంబున కొడంబఱుచునపుడు మీ రుపదేశించిన ధర్మములు మఱచితిరా?

ఉ. కాలము లేదొకో వ్రతనికాయపరత్వమునం జెలంగఁగాఁ?
బోలునె నిండు జవ్వనము పోకడవెట్టి యరణ్యచంద్రికా
జాలము చేసి, పుష్పసదృశం బగు మే నలయింప నిట్లుగా?
నోలి సమస్తభోగముల నొంది తుద న్వ్రత మూనఁగాఁ దగున్. 9.

ఇది మీ రుపదేశించిన ధర్మముకాదా?

రుక్మాం.—అవును. తద్విరుద్ధముగ నే నిప్పు డేమంటిని? సంసారపరిత్యాగము వలదంటి. నీతి నియమము లక్కఱలేదంటినా? పామరులకును బ్రాజ్ఞులకును నిదియకదా భేదము.

ఉ. పామరులట్లు ప్రాజ్ఞులును భావవికారసమాకులాత్ము; లా
పామరకోటికిన్ ధరణిఁ బ్రాజ్ఞులకుం గలభేద మొక్కఁడే;
నీమము కాలనిర్ణయము నీతిఁ దలంపరు భోగసక్తులై
పామరు, లట్లుగా కుచితవర్తనశీలురు ప్రాజ్ఞులారయన్. 10.

నేఁడును రేపును యథార్థముగ నీమంబునడిపి యామీఁద నీ యభీష్టప్రకారమ్ముగ మెలంగెద. వ్రతమండపమునకుఁ బోవుదము రమ్ము.

మోహి.—రాజేంద్రా! నాహృదయంబున మన్మథాగ్ని రవులఁబెట్టి యాసంతాపంబు సహింపఁజాలక నేను వేఁడుకొన్న కొలఁదిని జాగుచేసెద వేల? నాప్రాణములు ని

లుపవు. నీవు చయ్యన నన్ను మదనక్రీడలం దేల్చి కాపాడుము.

రుక్మాం.—మానినీమణీ! ఇట్లు పామరస్త్రీ చందమునఁ బలికెద వేల?.

మ. అకటా శ్రీహరివాసరంబున వినింద్యంబైన కామోపభో
గకలాపంబున కుత్సహింపఁ దగునే, కల్యాణసందోహదా
యకమౌ మోక్షద మైన సద్వ్రతము భక్త్యారూఢచిత్తంబున
న్వికచాబ్జాక్షి సపత్నులం గలిసి సేవింపంగ రమ్మా త్వరన్. 11.

వ్రతమండపంబునకుఁ బోయి యచ్చట జాగరము సేయుదము రమ్ము. నీ సపత్నులు మన
కై వేచియుందురు. ఇఁకఁ దడవు సేయకుము రమ్ము.

మోహి.—ప్రాణనాయకా! నీకును నా సపత్నులకును గలిగిన వైరాగ్యము నా
కిప్పు డెట్లుగలుగును?

మ. పరిపాలించుచు సాటిలేని సిరు లొప్ప న్మేదినీచక్రమున్,
దరుణీరత్నశతంబుతోఁ గలిసి నానాభోగము ల్గంటి భూ
వర, వైరాగ్య ముపన్యసింపఁ గలిగెన్ బాండిత్యము న్నీకు నా
తరుణప్రాయము నెంచనైతివిగదా దాక్షిణ్య చిత్తంబునన్. 12.

రుక్మాం.—

చ. పరువ మశాశ్వతంబు, క్షణభంగుర మీతనువు, వాత్మ యొక్కఁడే
స్థిర, మని నమ్మి, నిశ్చలమతిం బరలోక విశుద్ధభోగము
ల్విరివిగఁ జేకురం దగిన వేదసమీరిత పుణ్యకర్మముల్,
తరుణిరో సేయఁబూనుము, వ్రతమ్మును జేయఁగ రమ్ము, ప్రీతితోన్. 13.

మోహి.—కటకటా, ఎంతమోసము. ఎంతమోసము. రాజచంద్రా! ఎంతమో
సము చేసితివి.

ఉ. నిక్కపుమోహమున్ బలుకునిక్కడ గల్గినవాఁడవంచు నీ
టక్కుటమారివిద్దెల నుటంకుల నమ్మి విమోహితాత్మనై
చిక్కితి నీకు నావలపు సిగ్గులచేటుగఁ జేసి తిమ్మెయిన్
అక్కట యేమి చెల్లదు ధరాధిపులే తగవుజ్జగింపినన్. 14.

రుక్మాం.—కాంతామణీ! నే నేమిమోసము చేసితిని. తగ వుజ్జగించి నేఁజేసిన
కార్య మేమి?

మోహి.—రాజచంద్రా! నీవు నన్నుఁ బరిణయమ్మున కొడంబడుపఁగోరి నపుడు, జరాభరంబున నిద్రలు నీమము లొప్పనుగాని యౌవనకాలంబునఁ దగ వనియు, తనువు క్షణభంగుర మనియు, బోధించినమాట మఱచితివి కాఁబోలు. సెబాసు, సమయానుకూల ముగ ధర్మము లుపదేశింప నేర్చిన మీతో నేను వాదింపఁ గలనా? పురుషుల స్వభావ మిప్పుడు తెలిసికొంటిని.

చ. ముగుదల గాంచినప్పుడు వివుక్తవివేచను లౌచుఁ బూరుషుల్
డాగవిలుకాని కోడి ధృతిదూలి వేగల్ పచరించి, బాసలం
దగులము కొల్పి, భోగపరతంత్రతలఁ జేసి, యభీష్టతుష్టులై,
విగతవిమోహులై, విసిగి, వెక్కస మంది త్యజింతు, రిమ్మెయిన్. 15.

రుక్మాం.—ప్రియురాలా! నీయెడ వల పుడిగి నే ని ట్లనుటకాదు. నా కంతకం తకు నీయం దనురాగము పెరుఁగుచున్నది గాని తఱుగుట లేదు. నేఁడును రేపును శ్రీ హరివాసరవ్రత నియమవాసరములు. విషయేచ్ఛల వర్జింపవలయు. ఆ మహావ్రతము శాశ్వ తసౌఖ్యపదవి నొసఁగఁ గలదు. భక్తితో నావ్రత మాచరించి శుభంబులు వడయుము.

మోహి.—భోగతుష్టి నీకుఁ గలిగినది గావున నీ చిత్తమును బ్రశాంతము చేసికొ ని వ్రతనియమము జరుపం గలవు. అది నా కెట్లు సాధ్యమగును? విషయవాంఛావిర హిత నైన నన్ను దుస్సహం బైనచిత్తజవికారంబు పాలుచేసితివి. నీ కులసతి నైన నా కును భోగతుష్టి కలిగించి నన్నుఁగడతేర్చు బాధ్యత నీది కాదా? అట్లు చేయకున్న నీ కు మాత్రము మోక్ష మెట్లబ్బును?

క. పురుషులపోఁడిఁ గన వెఱుతును
విరహిత విషయానుబంధ విమలాత్మను; నీ
సరణి నను మరులు గొలిపిన
గురుపాతక మెందుఁ బోవు? కువలయనాథా! 16.

కావున నాకును భోగతుష్టి గావించి యామీఁద మోక్షోపాయ మరయుట లెస్స. ప్రాణ వల్లభా! రారమ్ము.

క. వల పగ్గలమై చనుబం
తులు పిక్కటిలంగ నీవి దొలఁగఁగ మణితం
బొలయఁగఁ బైకొను జవ్వని
కలయిక గల సుఖమురుచిని గనుము నృపాలా! 17.

రుక్మాం.—కాంతామణీ! పాపభీతిలేక యెట్టిధర్మవిరుద్ధములు పలుకుచున్నావు. తడవగుచున్నది. వ్రతమంటపమ్మునకుఁ బోవలయు. ఇంకనైన జ్ఞానము వహించి వ్రతాచరణ తత్పరమతివి గమ్ము. అట్లు గానోప వేని నన్నుఁ బోనిమ్ము.

మోహి.—రాజేంద్రా! ఎట్టిబాసలు నెన్ని ప్రమాణములు పల్కి నావ్రతము చెఱిపి నన్ను బెండ్లాడితివి. జ్ఞాపకమునకుఁ దెచ్చుకొమ్ము. నా యభీష్ట మీడేర్పక పోదువేని నీకసత్యవాక్య మహాపాతకం బబ్బును. పరమోత్కృష్ట మైన సూనృతవ్రత మేల చెఱుపుకొనియెదవు. నీతొలిబాసలు నెఱవేర్చి సత్యవాక్యపాలనము చేసికొనుము. శ్రీ హరివాసరవ్రత మొకసారి భంగమందినను మఱల నవిచ్ఛిన్నముగఁ గావించిన ఫలప్రద మగును. ఒక్కపరి సూనృతభంగ మైన మహాపాతకము వొరయును. నామాట వినుము.

రుక్మాం.—

చ. హితములుగావు నాకు నిఁక నీదృశధర్మ విరుద్ధ దుష్టభా
షితములు, మానుఁ; మీవ్రతము సేయుట మానుమటంచు వేఁడ కే
యితరవరంబు వేఁడినను నిత్తును, దోడన తీర్తు నీయభీ
ప్సితములు, బోవలె న్వడిగఁ జేర్కొను మెయ్యది నీయభీష్టమో.

మోహి.—ఏవరము గోరిన నేమి ప్రయోజనము? నెఱవేఱని వరములు నేనడుగనేల? మీ రియ్యనేల?

క. చెలి నేఁడాదిగ నీ మన
మలరంగాఁ జేయుచు ననయము నీకను స
న్నల మెలఁగు వాఁడ నని బా
సలు సేయవె మున్న? యటుల సల్పితివె నృపా? 19.

రుక్మాం.—ధర్మహానిలేకుండ నీకనుసన్నల మెలఁగుదు నని వరంబుగాని ధర్మేతరకార్యమ్ముల కొడంబడుదు ననియా, వరంబు?

మోహి.—తర్కశాస్త్ర పారగులగు మీతో ధర్మాధర్మనిరూపణ వాదముసేయుటకు నే నేపాటిదానను. వరము నెఱవేర్ప నిచ్చలేకున్న నేదికోరిన నదియె ధర్మేతరం బనివాదింప నోపుదువు. వేఱె వర మడుగనేల? ఇప్పటి కింత యైనది. నీబాసలు నమ్మి నిన్నుఁ బరిణయమై నీవలపు నటనలు విశ్వసించి, స్త్రీలకు సహజాలంకారమైన సిగ్గు సయితము విడిచి, యెవ్వరైన విన్న నవ్వుదురనుశంక యైనలేక, నాకోరిక నోరువిడిచి చెప్పి రట్టువడితిని. ఇఁక నన్నేమందురు? నాకొక్కటియే వరము గావలయు. మఱలనమ్మునకేఁగుటకు నాకు సెలవొసంగుఁడు. అట నా మానంబు కాపాడుకొను వెరవరసెద.

రుక్మాం.—(తనలో) అక్కటా! నే నెట్టి దుశ్చరితుండను. నిరవధిక భక్తిరసావేశంబునఁ దదేకాగ్రబుద్ధి హరినామ సంకీర్తనంబు సేయుచున్న యీ జవ్వనిని నగ్గించి ముద్దాడి చిత్తజవికారంబు పాల్పఱచితిని. నాచే రవులుకొల్పఁబడిన యీ మదనానలంబు చల్లారక యిప్పు డీతరుణి మిగుల సంతాపించుచున్నది. తద్విషాదభరంబున నెంతకయిన సాహసింపఁ దలంచుచున్నది. ఇప్పు డెట్టులయిన నూఱట గల్పింప నొప్పు. (ప్రకాశముగా) ప్రేయసీ! నీ వేమి వరంబు వేఁడినను బదులుమాట చెప్పక నొసంగెదను. వ్రతము మాత్రము మానుమని నేఁడు వేఁడవలదు.

మోహి.—మున్ను నిట్లే పల్కితివిగదా రాజేంద్రా! నీ పొడిమాటలయందు నాకు నమ్మకము లేదు.

రుక్మాం.—శ్రీహరియే సాక్షిగాఁ బలుకుచున్నాను. హరివాసరవ్రత విఘ్నము పొరయకుండ నీ వేవరంబు వేఁడిన నొసంగెదను. తత్క్షణంబ నెఱవేర్చెదను.

మోహి.—(తనలో) ఇత్తఱి నీనృపాలుని హృదయచ్ఛేదకంబయిన వరంబు వేఁడి యీవరము నెఱవేర్చుటకంటె వ్రతము మానుకొనుటయే మే లని తోఁచునట్లు చేసెద. (ప్రకాశము) రాజేంద్రా! వినుము. నాకీవరంబు తత్క్షణము నెఱవేర్పుము.

చ. అరసెద నీదు సత్యవచనాదృతి నిష్ఠయుఁ గొంకు లేక నీ
వరసుతు కంఠనాళము భవత్కరవాలముచేతఁ ద్రెంపి భూ
వర! హరి వాసరవ్రతము వన్నెయువాసిదలిర్ప సల్పి సు
స్థిరముగ నీయశంబు విలసిల్లఁగఁ జేయ వరంబు వేఁడితిన్. 20.

[రుక్మాం.— విస్మయజడుఁడై నిలుచును.

మోహి.—ఇప్పు డేమి యుపాయ మరయుచున్నావు? వినియు విననట్లు నటించెద వేల? తడవుసేయక నీహరివాసరవ్రత నియమము ప్రకటించి నిర్విఘ్నముగ వ్రతమాచరించి నీయశంబు వెలయం జేయుము.

రుక్మాం.—(తనలో) అశనిపాతంబునుం బోలు నీ పాపాత్మురాలిపలు కేధీరునిహృదయమేరుభూధరం బగలింపదు. ఇట్టి క్రూరవరంబు వేఁడువా రెందైన నుందురా? నిరపరాధుఁడును వంశోద్ధారకుండును సకల సద్గుణ భూషితుండు నైన నాముద్దుఁగుమారునియెడ దీని కిట్టి క్రూరబుద్ధి యేల గలిగె?

మోహి.—రాజేంద్రా! ఇదివఱకే నన్ను బద్ధమాడి వంచించితివి. పరిభవక్లేశ విషణ్ణం బయిన నాచిత్త మింక నీవంచన నోర్వఁపదు. నీ చందమంతయు నెఱింగితిని. నేఁగోరిన పని చేయుటకు నీ కిష్టము లేదు. ఎట్టులైన నలుగురలోఁ బెట్టి నన్ను రట్టుచేయ నుంకించుచున్నవాఁడవు. బుద్ధిహీనురాలనై నీచేఁ జిక్కితిని. నాయెడ దయార్ద్రహృదయుఁడ

వై నా దుర్జనత్వము మన్నించి నన్నుఁ బోనిమ్ము. నీ సూనృతానృతములతో నా కేమిపని?

రుక్మాం.—మోహినీ! నే నసృత మాడువాఁడను కాను. నిష్కళంకం బైననా మావంశమున కట్టి మాలిన్యము ఘటింపనొల్లను. కాని నీవు బ్రహ్మమానసపుత్త్రివి. సకల ధర్మము లెఱింగినదానవు నీ విట్టి వరంబు వేఁడుట నాకు వింత సేయుచున్నది.

ఉ. వెంగలిచాన రీతిఁ గడువింతలు పల్కెదు చోద్య మయ్యె; నీ
భంగి సమస్తముం గనిన భామిని నన్నుఁ బరీక్ష సేయు దీ
క్షం గమలాసనుండు నినుఁ గల్పన సేసి వ్రతంబు నెమ్మెయిన్
భంగము సేయఁగా నిటకుఁ బంచినచందము దోఁచె మానినీ! 21.

మోహి.—చాల్చుఁ జాలు. ఇంతవఱకు నన్ను దూషించితివి. ఇప్పుడు నాతండ్రిని నిందింప నుపక్రమించితివా? రాజేంద్రా! ఏల్త యింత బూటకము.

రుక్మాం.—మోహినీ! బూటక మేల? నా కుమారుని రావించి నీవు కోరిన వరంబు దెల్పి యతని యనుమతిచే శిరంబుఁ ద్రుంచి నీ కోరిక తీర్చెద. ప్రతీహారీ! నీవు పోయి చిరంజీవిని వెంటనే తోడ్కొని రమ్ము.

[ప్రతీహారి యేఁగును.

మోహి.—(తనలో) ఈరాజచంద్రుఁడు వ్రతమునందలి భక్తిచేఁ గొమారుని శిరంబుఁ ద్రెంపుట కైన నొడఁబడుచున్నాఁడు. ఆ కుమారుఁడు మిక్కిలి వినయశీలుఁడు. మాటాడక యనుమతించును. సంధ్యావళీదేవి కీసంగతి తెలిసిన పుత్త్రివాత్సల్యంబుచే నామె యడ్డుపడక మానదు. అప్పుడు గాని యీ మహానుభావుని చిత్తశుద్ధి ప్రకటముగాదు. (ప్రకాశముగా) నీకుమారుని యనుమతిని వడసెదనంటివి. కేవలబాలుఁ డైన యాతని యనుమతి నిరర్థకము. ఆతని తల్లి సంధ్యావళీదేవి యనుమతి వలదా? లేకున్న నీ కాతని శిరంబు ద్రుంచుట కధికారమెక్కడిది?

రుక్మాం.—అక్కటక్కటా! నా హృదయమును కఱకుటంపములఁ గోయుచున్నది గదా ఈ పాపి? సంధ్యావళీదేవి యనుమతి నెట్లు వేఁడుదును? ఈ రక్కసియందలివలపునం జేసి మదీయధర్మరక్షణపరాయణాత్మయు, నస్మదిచ్ఛానుకూలమానసయు నగు నాపరమసాధ్వి నుపేక్షించి దుఃఖపెట్టితిని. అది చాలక యిప్పుడు సపత్నీ మనోరథంబుఁ దీర్ప తన కొమారునిప్రాణము లిమ్మని యెట్లు వేఁడుదును?

[కన్నీరు విడుచుచు నిలుచును.

మోహి.—రాజేంద్రా! సంధ్యావళీదేవి యనుమతినిబడసి నీ వాబాలునిశిరంబు ఖండింపవలయుఁగాని యామె యనుమతి వడయక త్రుంపఁ దగదు. నీవు నీవర్తితోలఁది చేసినపనికి లోకమంతయు నన్ను నిందింతురు. తల్లిలేనియెడ యేకపటోపాయంబున

నో యాపిల్లవాని శిరంబుఁ దెగవేయించితి నని నాకు దూఱు కలుగును.

రుక్మాం.—మోహినీ! నాచిత్త మిట్లేల శోధించెదవు? సంధ్యావళి యనుమతిని నీ కొఱకై నే నెట్లు వేఁడ నోపుదును (అనునంతలో)

మోహిని.—విసర్జించితివా? నేను విసర్జింపుమంటినా? సాగరికా? రావే పోదము. ఈ నరపాలుఁడు నా బ్రదుకు దుర్భరనిందాకళంకితంబు గావింపఁ జూచుచున్నాఁడు. (పరిక్రమించి) అయ్యో, నే నెందుఁబోదును. వనమున కేఁగి తప మాచరింపుమని పంపిన నా జనకునిమాట నతిక్రమించి కన్యాత్వము కోలుపోయి భర్తచే నవమానింపఁబడి మఱల నా యన సన్నిధి కెట్లేఁగుదును. సాగరికా! నాకు మరణమే శరణము. త్రావినంతనే ప్రాణములు పోవు విష మేదైనఁ దెమ్ము. ఈ యుంగరములోనివజ్రమును నూరి పొడిచేసి తెమ్ము. నీళ్లలోఁ గలిపి త్రాగి ప్రాణములు విడిచెదను.

[అని గదిలోనికిఁ బోవును.

రుక్మాం.—(తనలో) ఈమె ప్రాణ పరిత్యాగము సేయ నుంకించుచున్నది. ఈమెఁ తయం దేదోసమును లేదు. అంతయు నా తప్పే. మొట్టమొదట నీమెయందలి వలపునంజేసి నేనే యాసాధ్వీమణిని సంధ్యావళిని విసర్జించితిని. నేనే యీ జవ్వనిని పిరాళి పాల్పటిచితిని. ఈ మగువను నిందించిన ఫల మేమున్నది? వెంబడించి పోయి చేయి పట్టుకొని (ప్రకాశముగా) బాలికామణీ! నీవు చెప్పినచందమున సంధ్యావళీదేవి యనుమతి. వడసి యా బాలుని నొడంబఱిచి యాతని శిరంబుఁ ద్రుంచెద. నీ వేసాహసంబునకుఁ దెగింపకుము. ప్రతీహారీ! సంధ్యావళిని బిలిచికొని రమ్ము.

[ప్రతీహారి వెళ్లును.

మోహి.—జీవితేశ్వరా! నీ విట్లు నన్ను వారింపకుము. పుట్టింటికిని జొచ్చిన యింటికిని గూడఁ జెట్టనైతిని. నా బ్రదుకు నాకే దుర్భరం బగుచున్నది. నన్ను విడిచి పెట్టుము.

[విదిలించుకొని శయ్యాగృహమునకు పోవును.
[రాజు వెంబడించును.

[తాపసుఁడు ప్రవేశించును]

తాపసుఁడు.—కామ రూప ధారినై యిఁట దాఁగియుండి మోహినీదేవివలపు వాలపునం బడి వ్రతభంగము సేయకుండ నీ రాజును సమయంబునఁ బ్రబోధించితిని. ఈతఁడు ధీరస్వాంతుఁడు. ఆ మాయలాఁడివలలో నింకఁ దవులు కొనఁడు. ఇఁక నీ వ్రతోద్ధారము నా శిష్యుఁడైన ధర్మాంగదునియం దున్నది. ఇతండు తనశిరంబు దెగుటకుఁదా నొడఁబడుటయే గాక తన తల్లినిఁగూడ నొడంబఱుప వలయు. అల్లదె తండ్రిగారి సన్నిధికి వచ్చుచున్న వాఁడు.

చ. జనకుని జ్ఞానసంపద భృశంబుగఁ దోఁచెడు నీ కుమారునం,
దనుపమ పుణ్యశీలుఁడు, దయామహితాత్ముఁ డితండు, నేను నీ
యనఘుని నాప్రబోధన వ్రతావనతత్పరుఁ జేసి, మోహినీ
వనిత రచించు మాయలను వమ్మొనరింతు, జగద్ధితంబుగాన్. 22.

(ధర్మాంగదుని ఎపష్ఠాని) వత్సా! ఎచ్చటి కరుగుచున్నావు. వ్రతమండపమ్మునకు మీ రెవ్వరును ఇంతవఱకు కరుదేరమిం జేసి మీ రందఱు నిప్పటున్నా రేమో యని శంకించి యిటు కరుదెంచితిని.

ధర్మాం.—తాపసవర్యా! (నల్గడలఁ బరికించి) మాతండ్రిగారు నన్నిటకు రమ్మని యిప్పుడే ముదల యంపిరి. వా రెక్కడ?

తాప.—వత్సా! వారు శయ్యాగృహంబున నున్నారు. నేఁ జెప్పు మాటలు సావధానంబుగ వినుము. నీవలన నిప్పుడే శ్రీహరివాసరవ్రత ముద్ధరింపఁబడ వలయును.

మ. అమరున్ శ్రీహరివాసరవ్రతము పాపాహార్యవజ్రాయుధం,
బమలాంతఃకరణుండు నీజనకుఁ డుద్యద్భక్తితో భూప్రజా
సముదాయమ్మును గూర్చి యీవ్రతము దా సల్పున్; విశుద్ధాత్ములై
తమ పాపంబులఁ బాసి రెల్లజనులున్ దద్భూరిపుణ్యంబునన్. 23.

క. ఆ సద్వ్రతమును భంగము
దా సలుపఁ గడంగె భోగతత్పరమతియై,
నీ సవతితల్లి మోహిని,
వాసిగ వెలయింపు మల్లవ్రత మీవు ధృతిన్. 24.

క. ఆ పావన సద్వ్రతమును,
కాపాడితివేని, నగు జగమ్మునకు హితం,
బీ పుడమిజనులు దాసం
బాపంబులు దొలఁగి ముక్తిఁ బడయుదురు; సుమీ. 25.

గీ. మోహినీకాంత దుస్తంత్రములను బన్ని
ధైర్య మెడలించెఁ, గాన నీతండ్రి కీవు
ధృతి దలిర్పఁగ నీతల తెగుట కైనఁ
దెంపు గావించి వ్రత ముద్ధరింపవయ్య. 26.

రుక్మాం.—

క. గురువర్య భవద్బోధ
స్ఫురణంబున నాదు మదినిఁ బొడమెను జ్ఞానాం
కురములు; పండిత పామర
శరణం బగు నీవ్రతము రసన్ వెలయింతున్. 27.

మహానుభావ! మీ యాశీర్వచన మొసంగుఁడు. [పాదములకు నమస్కరించును.

తాప.—వత్సా! నీకు శుభం బగుగాక; నీవు లోనికరుగుము. నే నిచ్చట నుండి నీ యభ్యుదయమునకై యాశ్వరునిఁ బ్రార్థించుచుండెద.

ధర్మాం.—మీరు సంకోచంబు దక్కియుండుఁడు.

[నేపథ్యమున].

రాజేంద్రా! నాకొంకుమాటలు పనికిరావు. నీపట్టపుదేవిని నీకుమారునిఁ బిలిపించివారల నొడంబఱిచి యామీఁద నాకడకు రమ్ము.

రుక్మాం.—(శయ్యాగారము వెలువడి)అకటా! ఎట్టికష్టము వచ్చినది. ఈ పెనుభూతము రవంతయైన కనికరము లేక నా ముద్దుఁగుఱ్ఱని శిరంబుఁ ద్రెంపు మని వేఁడుచున్నది.

సీ. తనువు కోమల మంచుఁ దమికొంటినే గాని,
యినుపగుండియ యంచు నెఱుఁగ నైతి;
సకలంక మని మోము సగ్గించితినె గాని,
యాత్మకలంకమ్ము నరయ నైతిఁ;
బలుకు తీయ నటంచు భ్రమఁ జెందితినె గాని,
హృదయంబు విషమాట నెఱుఁగ నైతి;
మై సొంపు సిరిఁ గాంచి మోసపోయితిఁ గాని,
గోముఖవ్యాఘ్రి యనొ కనఁగ నైతి;
గీ. తెలిసి తెలియక దీనిని దెచ్చుకొంటి,
వరుసగా దీని మార్గంబు లరసి చూడఁ,
బుడమి ధర్మంబు వెలిపుచ్చి పుణ్యకర్మ
పుంజములఁ బాపవచ్చిన భూత మకట! 28

ధర్మాం.—(సమీపించి తండ్రిపాదములకుఁ బ్రణమిల్లి) నాన్న గారూ! మీ గారాబు బుత్త్రుఁడను ధర్మాంగదుఁడను బ్రణమిల్లుచున్నాఁడ.

రుక్మాం.—(ఎత్తి కవుంగిలించికొని) హా కుమార! మారసమాకార! నే నెంతపాపకర్ముఁడను తండ్రీ! [మూర్ఛిల్లును.

ధర్మాం.—మేరుసమానధీరులు, మహాపుణ్యశీలురు, నాన్న గారు ఎంతధైర్యము దూలియున్నారు. నాన్న గారూ! సమాశ్వసిల్లుఁడు, సమాశ్వసిల్లుఁడు.

[రుక్మాంగదుఁడు మూర్ఛదెలిసి కుమారుని తొడిలోఁ గూర్చుండఁబెట్టుకొని కన్నీరు నించును.

ధర్మాం.—నాన్న గారూ! మీ రిట్లు దైన్య మంద నేల? మీ రెఱుంగని ధర్మము లేమిగలవు? ఇక్కట్టులలో ధైర్యము విడనాడఁ దగునా? ఇక్కట్టు లెప్పుడును మేలు కొఱకే గదా వచ్చును. ఇడుమల నందనిమానవుఁడు పరిశుద్ధాత్ముఁడు కాఁగలఁడా? ఇడుమల ననుభవించిన కొలఁదిగదా మానవునకు నిష్కళంకస్థితి కలుగుచుండును.

మ. చల దంభోనిధి వారిపుంజము నిజస్వచ్ఛప్రభాదీధితుల్
వెలయన్ మారుతసంహతిన్ సుడియుచో విభ్రాజితంబౌ; సము
జ్జ్వలసౌజన్యగుణావళుల్ ప్రకటమై వాసిం గనన్ సజ్జనుం
డలరున్ ఘోరవిపద్భరంబునన శుద్ధాత్ముండు నై యొయ్యనన్. 29.

మ. పుటము ల్వెట్టుకొలంది స్వచ్ఛమగుచున్ బొల్పొందుజాంబూనదం
బటు లార్తీయకళంకముల్ దొలఁగఁగా నార్యుం డిలన్ భాసిలున్,
స్ఫుటమై సద్గుణజాల మెల్ల వెలయన్ శుద్ధాత్ముఁడై ధారుణిన్,
జటులాపన్నికరాగ్నితప్తుఁ డగుచో సర్వంసహాధీశ్వరా. 30.

మఱియు కష్టములు తొలుత దుర్భరదుఃఖావహములై కనిపించి తుద కత్యంతశ్రేయోదాయకము లగును.

మ. విసముల్ మాన్చును రోగముల్, రుచులఁ గల్పించుంగదా క్షారముల్
పస నిచ్చున్ శ్రమ మేని, కాతపమె కా వర్షంబుఁ గల్పించు, ని
ట్లసమానం బగుకష్టమే తుద కమేయం బైనసౌఖ్యంబులన్
బొసఁగన్ గూర్చును; దైవచిత్ర మరయన్ భూనాథ శక్యంబొకో. 31.

యథాసంభవంబుగ సుఖదుఃఖంబు లనుభవింప వలయు. సర్వజ్ఞులకు మీ కిట్లుధర్మంబు సెప్పఁబూనితి నని కోపింపకుఁడు.

రుక్మాం.—నాయనా! నీవయసునకు మించి నీకుఁ గలిగిన జ్ఞానసంపద నా దుఃఖమును మతిమతి పెంచుచున్నదిగదా? లోకములోఁ గష్టము లనుభవించినవారు కలరుగాని యిట్టి బెట్టిదం బయినయిక్కట్టు లెవరి కైనఁగలుగునా?

ధర్మాం.—నాన్నగారూ! ఆయిడుమ యెట్టిదో వక్కాణింపుఁడు. ఇహ పరంబులరెంటను దమకు శక్తికొలఁది సౌఖ్యము సమకూర్పఁదలఁచినవాఁడను తమ పుత్త్రుఁడను. నే నెట్లు పేదవానివలె తమ సంతాపంబు చూచుచు నూరకుండఁ గలను. ఆ కష్ట మెట్టిదో వివరింపుఁడు; నాశక్తికొలఁది వారించి, నాజన్మమును సార్థకంబు సేసికొనియెద.

రుక్మాం.—తండ్రీ! నే నెట్లు వక్కాణింతును? చెప్పుటకు నోరాడకున్నది.

[సంధ్యావళిదేవియుఁ దక్కిన రాజపత్నులును బ్రవేశింతురు.]

సంధ్యా.—ఆర్యపుత్త్రా! తమపాదసేవకురాలను సంధ్యావళిని ప్రణమిల్లుచున్నదాన.

[తక్కినవారును బ్రణమిల్లుదురు.

రుక్మాం.—దేవేరులారా! మీ భక్తివిశ్వాసములచేత మిగుల లజ్జితుఁడను.

సంధ్యా.—జీవితేశ్వరా! తమ రట్లు సెలవియ్యవలదు. ఎన్నియో జన్మములఁ జేసిన నోములఫలమున నోగదా మహాపుణ్యులయిన తమకుఁ బాదసేవ సేయుభాగ్యముం గంటిమి. ఆర్యపుత్త్రా! తమ రిట్లు విన్నదనం బందియుండఁ గతం బెయ్యది? శత్రుసమూహముల నడుమనైన బొమ్మునఁ జేయి నిడికొని నిద్రింపఁగల ధైర్యశాలు లగు మిమ్ము దైన్యంబుపాలు చేయు నిడుమ యెయ్యది? ప్రసన్నులయి మా కెఱింగింపుఁడు.

ధర్మాం.—నాన్నగారూ! తెలిసిన కష్టములకంటె తెలియనికష్టము లెక్కుడు దుఃఖముం జేయుంగదా? ఆయిడుమ యెట్టిదో మా కెఱింగించి దుఃఖభారమును శాంతింపఁ జేయుఁడు.

రుక్మాం.—కష్టా! ఇట్టి బెట్టిదపుమాట యెట్లు చెప్పుదును? చెప్పక తీఱదుగదా? సాధ్వీమణులారా! కుమారా! కులపాంసనుఁడను నేను తెచ్చిపెట్టిన బెడఁద వివరించెద నాలింపుఁడు.

సీ. కామాంధకారంబు గన్నులఁ గ్రమ్మంగఁ
గ్రిందుమీఁ దెఱుఁగక కేవలంబు,
స్త్రీలోలతను జెంది, చెలువల నూర్వర
వరుసగాఁ బెండ్లాడి వారితోడ,
సంతుష్టి చెందక సన్మార్గవర్జినై
కులకాంతలను బిట్టు గోడుపెట్టి,

మైసొంపు మెచ్చి యిమ్మగువఁ బెండ్లాడితి
నన్వయభావంబు లరయ కకట!

గీ. వ్రతము విడుటొండె నన్రృతంబు వలుకుటొండె,
వంశవర్ధను సుకుమారు వరకుమారుఁ
జంపుటొండెను వేఁడె నీచాన. నాదు
పాప మీరీతి ఫలియించె బలిసి తుదను. 32.

సంధ్యా.—అయ్యో, నాయనా! ఎంత క్రూర్మమైనవరము వేఁడినది మోహినీదేవి? హా శ్రీహరీ! నే నేమిపాపము చేసితిని.

[సంధ్యావళి మూర్ఛిల్లును.

ధర్మాం.—తల్లీ! సమాశ్వసిల్లుము, సమాశ్వసిల్లుము. [తండ్రినిగాంచి] నాన్నగారూ! మోహినీదేవిగారు కోరినప్రకారము నాశిరంబుద్రుంచి ముక్తిదాయకంబైన శ్రీహరివాసరవ్రత ముద్ధరింపుఁడు. లోకహితంబు గావింపుఁడు.

రుక్మాం.—(కుమారుని కవుంగిలించుకొని) ఆ పనిఁజేయ నామనసెట్లు లొప్పును? నా చేయి యెట్లులాడును.

ఉ. పాలును బెర్గు మీఁగడలు భక్ష్యములుం గలమాన్నభోజ్యముల్
చాలఁగ బుజ్జగించి పలుచందములం దినిపించు చేత నీ
కాలభుజంగరాట్సదృశకర్కశమత్కరవాలధారచే
బాలమృణాళసన్నిభ భవద్గళఖండన మెట్లు సేయుదుర్ ? 33.

నాయనా! ఈ ఘోరకృత్యము నేఁ జేయనోప.

ధర్మాం.—అట్లు సెలవియ్యకుఁడు.

చ. చిరతరభక్తిఁ జేసితిరి శ్రీహరివాసరసువ్రతంబు, ని
ద్ధరణి పవిత్రమయ్యె, దురితంబులు వాసిరి సర్వభూజనుల్,
గురుతర పుణ్యమంతయును గోల్పడ నిట్లు సుతేషణంబుచే
నురు మహిమాఢ్యమై వెలయు నుత్తమసద్వ్రత ముజ్జగింతురే? 34.

నాన్నగారూ! మీరు సంకోచంబు దక్కి నాశిరంబు ద్రుంచి శ్రీహరివాసరవ్రతము నెఱవేర్పుఁడు.

సంధ్యా.—(సంధ్యావళి మూర్ఛ తెలిసి) అయ్యో నాయనా! నిన్నుఁబాసి నే నొకనిమిషమైన బ్రదుకఁగలనా? (కుమారునిఁ గౌఁగిలించుకొని)

సీ. గర్భస్థుఁ డై నీవు కదలినప్పుడె నీకు
నొత్తిడి యౌ నంచు నుమ్మలింతు ;
నేలపైఁ బడ నీవు నీమేను నొచ్చునో
యంచు నారట మొంది యడలుచుందు ;
గారాముచే దాదిగము లెత్తి ముద్దాడ
నలఁగిపోదు వటంచు నులుకుచుందుఁ
చూపఱు నినుఁగాంచి సొగసుకాఁ డనిమెచ్చ
దృష్టితాఁకునొ యంచు దిగులువడుదు;
గీ. అహారహంబును నీకేమి యగునొ యంచుఁ,
గనులలోఁ బెట్టికొని పెంచి కట్టకడను,
ముద్దుమురిపెంబు దీరకమున్న నిన్ను
కఱకుఖడ్గంబుపాల్సేయఁగలనె? పుత్త్రి! 35.

ధర్మాం.—అమ్మా! యీరీతి మోహాంధకారమున మునింగెదవా?

ఉ. ఎన్నిదినంబు లిమ్మెయిని హెచ్చుగుకూరిమిఁ బ్రోదిసేసినన్
మ న్నగు నెప్పు డైనఁ గొఱమాలినమేనిది ; దీనిఁగూర్చి యా
పన్నతఁ జెంది గుందఁ దగవా ధృతిమీఱఁ దదంతరంబునం
దున్న కడింది జీవునకు నుత్తమసద్గతిఁ గూర్పఁ డాదటన్. 36
చ. వగవఁగ నేలయమ్మ! ధృతిఁ బాసి తిరంబుగ నెవ్వ రైన నీ
జముగన నిల్చిరమ్మ! ఘనసంసృతి దుఃఖము లంది చీఁకులై
దెగులునఁ గుంది చచ్చు టొకతేజ మఁటమ్మ? జగద్ధితంబుగాఁ
దెగుట సముచితంబుగద తేజము పుణ్యము దానఁ గల్గెడున్. 37

సంధ్యా.—అక్కటకటా, నాయట్టి మందభాగ్య రా లెందైన నుండునా? ఎచ్చటనుండి వచ్చెను నాయనా యీ మోహినీదేవి?

క. పదినెలలు మోసికన్నది,
తుద కీదయ్యంబునోటఁ ద్రోయఁగ నౌకో?

గొడగొన్న రక్కసియు బలె,
నదయత నాబిడ్డప్రాణ మాసించె నయో! 38.

[మఱల మూర్ఛిల్లుచున్నది.

పుణ్యశీల, సాధుమతి, మున్నగువారు.—నాయనా! మీతండ్రిగారు మమ్ముఁగన్నులఁజూడక యుపేక్షించినను నీయాదరంబున మేము చింత యెఱుంగక నీతల్లి మహాసాధ్వి సంధ్యావళిచేఁ బ్రబోధితల మగుచు నిష్కళంకమానసలమై మనుచుంటిమి. నీవు మమ్ముం బాసిపోయిన మాకు దుఃఖమే గాక సంతోష మెట్లుండును? నీతోడన మాప్రాణములుం బోవుఁగాక. ఈతల్లి జీవించునా. మాసుమాత్ర మేల దుఃఖభాజనము లైన యీబ్రదుకులు నాయనా?

సంధ్యా.—(మూర్ఛ తెలిసి) నాయనా! నీకు వీరు సవతితల్లులుగారు. నిక్కమైన తల్లులే. వీరికి నీయెడంగల వాత్సల్యమునకు మితిగలదా? నిన్ను విడిచి యిందొక్కరైన జీవింపఁ గలరా?

సీ. పొందమ్మిరేకుల యందమ్ము నిరసించు
కందోయి గాటుక పొందుపఱిచి,
నెమలిపింఛముఁబోలు నీటైన పెన్నెఱుల్
దువ్వి కూఁకటి కట్టి పువ్వు లునిచి,
నిద్దంపుటద్దాల కుద్దియౌ చెక్కులఁ
గుంకుమ లేపంబు గుదురు పఱిచి,
బాలచంద్రునిఁ బోలు ఫాలభాగంబునఁ
గస్తూరితిలకమ్ము సిస్తుపఱిచి,
గీ. సొగసు దీరిచి గారాము చొప్పడంగ,
గూర్మిఁ బెంచినతల్లుల గోడువినుము,
నిన్నుఁబాసిన నిముసంబు చిన్నియన్న
బ్రతుకనేర్తురె? నీవెంట వత్తురయ్య. 39.

ఏ దుష్కృతఫలంబున నాకడుపునఁ బుట్టితివో కదా తండ్రీ! ఏపేదరాలికడుపుననైనఁ బుట్టిన నీకిట్టి కష్టమబ్బునా?

ధర్మాం.—అమ్మా! నేను దొల్లిటి జన్మమున మహత్తరమైన సుకృతంబు చేయుటం బట్టియే మహాజ్ఞానసంపన్నలును మహాపుణ్యశీలలు నగు మీ గర్భవాసంబున జన్మింపఁ

గంటిని. దానంజేసియే దేహాభిమానంబు వాసె. సూక్ష్మబుద్ధి నరసిన నాజన్మసాఫల్యం బునకె గదా యీ మోహినీదేవి యిట్టివరంబు వేఁడె. శ్రీహరి కత్యంతప్రియంబును లోకపావనంబు నైన మహావ్రతమునకయి నా శరీర మొసంగి భవబంధవిముక్తిఁబడయుట కంటె నుత్కృష్ట మైన ఫల ముండునా?

సీ. సకలచరాచరజాలంబులోపల
　　మనుజుఁడై పుట్టుట మాన్య మండ్రు;
మనుజుఁడై పుట్టినఁ మహితబలోద్యుఁడై
　　పురుషుఁడై పుట్టుట పుణ్యఫలము;
పురుషజన్మమునందుఁ బూర్ణవిజ్ఞానంబు
　　గలుగునందాక నర్థిలుట ఘనము;
పూర్ణవిజ్ఞానంబు పొసఁగిన సంతత
　　పరమార్థచింతనాపరత యరుదు,
గీ. పూర్ణవిజ్ఞానసంపద పొసఁగు దాఁక
మనినపురుషున కబ్బునే జనకవాక్య
పాలనమ్మునకయి తన ప్రాణముల స
మర్పణముసేయు శుద్ధాత్ముఁ డందు ఫలము. 40.

పుణ్యశీల.—కుమారా! అఖండ విజ్ఞాన సంపన్నుండ వగు నీ విట్లును ముక్తిపడె యం గలవు గాని, నీ వస్తమించిన పిదప మా కీలోక మంధకారమయంబె కదా తండ్రీ!

[కుమారునిఁ గౌఁగిలించుకొని యేడ్చును.

ధర్మాం.—తల్లులారా! ఇట్లు నాకొఱకు దుఃఖింపఁదగదు. ఇది యర్హముకాదు. మన మందఱముం గలిసి నాయనగారికి ధైర్యము చెప్పి వారి ధర్మముం గాపాడవలయు గాని, వారికి దుఃఖము పెంచి ధర్మాధర్మవివేచనప్రతిభ నశించునట్లు చేయఁ దగునా? జగంబున సకలధర్మములు క్రమంబుగ నడిపింపవలసిన సార్వభౌముఁడు గదా యీ మహానుభావుఁడు. ఆయనయే వ్రత ముజ్జగించి ధర్మముం దప్పిన నెట్లు?

క. నరపతి ధర్మము దప్పిన,
ధరణీజనం బట్ల నడుచుఁ; దద్దురితము భూ,
వరుఁ జెందును మొత్తముగా;
నరపాలుఁడు ధర్మ మెడలి నడువం దగునే? 41.

అమ్మలారా! పెక్కువగలం బొగలకుఁడు. సూక్ష్మబుద్ధి నరసిన నిఁక దుఃఖింపఁ గారణ మే మున్నది?

చ. అరయ సమస్తజీవులకు నాయువు నిశ్చితమాత్రకాల; మే
సరణిని మృత్యువుం దొరఁగ శక్యము గాదు; జగద్ధితంబుగా
నురు మహిమాఢ్యమై తనరు నుత్తమసద్వ్రత ముద్ధరింపఁగాఁ
దెరలక ప్రాణ మిచ్చి కడతేరెద ముక్తిరమాప్రియంబుగాన్. 42.

సాధుమతి.—నిరంతరము తన పాదారవిందముల నమ్మియకళంకభక్తిం దన్నుఁ గొలుచుచుండు నా కిట్టికష్టముల నా శ్రీహరి యేల కలుగఁజేసె? మాయెడ నాయన కిట్టి క్రౌర్య మేల?

ధర్మాం.—అమ్మా! అట్లు దలంపకుము.

చ. పరమకృపాకరుండు నిజభక్తమనోరథదాయకుండు సు
స్థిరసుఖసంప్రదాత యగు శ్రీహరి మీయెడ వత్సలత్వసం
భరితుఁడు గాక క్రూరుఁ డయి బాములఁ బెట్టునె? మిమ్ము మీమనం
బరయఁగఁ గోరి కైతవపుటార్తిని ముంచెను గాదె; మిమ్మిటుల్. 43.

క. శ్రీహరిభక్తుల కొక్కెడ
నైహికపరలోకసుఖము లరుదగు నెకొ,
యూహింపఁ జిత్తశోధన
కై హరి యిడినట్టి ఘనవికారం బిదియున్. 44.

క. ధృతి నీ యిడుమను దాఁటిన
హిత మగు కరుణాపయోధి యీశ్వరుఁ డిహాముం
దతులితసంపదలను నా
యతి నక్షయపద మొసంగు నాదట మీకున్. 45.

సంధ్యా.—కుమారా! నీప్రబోధమున నా చిత్తము ప్రశాంత మైనది. ఆ సర్వేశ్వరుండు మీతండ్రిగారి చిత్తము శోధింపఁ దలంచియే యిట్టివిపరీత మైన బెడఁదఁ గల్పించె. నీ యిక్కట్టున మీతండ్రికి ధైర్యము నూఁగొనఁబలికి తదీయధర్మసంరక్షణ మొనర్చుట నీ చెప్పినయట్లు కులకాంతలకు మాకు విధియే యగును. ఆర్యపుత్త్రి! ఈ కుఱ్ఱని పలుకుల నాలించితిరిక దా? తడయ నేల? ఆ శ్రీహరిని నిరంతరము నమ్మియున్న మనము ఈ ముద్దుఁ

గుఱ్ఱని నాతని కర్పణము సేయుటకు సంకోచింప నేల? మోహినీదేవి కోరినయట్లు గావించి వ్రతము సాగింపుఁడు.

[మోహిని తటాలునఁ బ్రవేశించి]

మోహిని.—కటకటా! ఎంత సాహసురాలవమ్మా నీవు. కన్నకుమారుని శిరంబు ద్రెంపుటకు సమ్మతింప నీ వెట్టిదిట్టవమ్మా?

మ. జనపాలాగ్రణి, యెప్పుడో యెటులనో సంప్రాప్తమౌ మోక్ష మీ
తనువుం బాసినమీఁద నంచు, నిజసత్యస్ఫూర్తికై పావనా
వను నాత్మోద్భవు బిల్కుమార్చి పితృవ్రాతం బధోలోకపా
తనఖేదంబునఁ గూలఁగా నిజకులధ్వంసంబు గావించెదే? 46.

రుక్మాం.—చాలుఁజాలు. ఊరకుండుము. నీకోరినయట్లు నాకుమారుని శిరం బీకరవాలమునఁ ద్రెంపి, శ్రీహరి కర్పించి శ్రీహరివాసరవ్రతము సుప్రసిద్ధంబు గావించి, నావంశజాల కందఱకును మోక్షంబు సాధించెద. తొలంగుము. నాయనా! ఆ శ్రీహరిపాదారవిందములు చిత్తమునఁ గీలించి యిటఁ గూర్చుండి శిరంబు వంపుము.

[అని రుక్మాంగదుఁడు కరవాలము జళిపించు శిరంబు దెగ నేయఁబోవును.

మోహి.—తండ్రీ! పంకజాసనా! ఈ రాజచంద్రునిహృదయంబు నింకను శోధింపవలయునా? నే నీ ఘోరమును జూడఁజాలఁ; బ్రసన్నుండ వగుము. ఆర్తత్రాణపరాయణా! శ్రీమన్నారాయణా! ఈకుమారుని సంరక్షింపవయ్యా, నామొఱయాలింపవయ్యా.

[ఆక్రందనము సేయుచు మోహిని యడ్డపడును.

[నేపథ్యమున.]

చ. నిలునిలు పార్థివేశ్వర! యనింద్యము నీచరితంబు ముజ్జగం
బుల నుతికెక్కె, నిన్ను సరిపోలఁగఁ జాలినసూనృతవ్రతా
ఢ్యులఁ గన నెందు? నీతనయుఁడు న్నినుఁ బోలినవాఁడ, యీ సతీ
తిలకము సచ్చరిత్రము మదీయమనఃప్రియ మాచరించెదుర్. 47.

[గరుడవాహనారూఢుఁడై శ్రీహరి ప్రవేశించును. అందఱు
విస్మయభరితులై చూతురు. పుష్పవృష్టి గురియును.]

సంధ్యావళియుఁ దక్కిన రాజపత్నులును-(మోహినీదేవిని సమీపించి) అక్కా! నీ వెవ్వరో దేవతవుకాని మానవసామాన్యురాలవు గావు. నీజాడ యెఱుంగనేరక నిన్ను దూషించితిమి. మా తప్పులను క్షమింపుము.

మోహి.—అక్కలారా! నేను మిమ్ముఁ బెట్టినకష్టములకు వెక్కస మందకుఁడు. ఇ దంతయు దేవతావిలాసము.

శ్రీహరి.—రుక్మాంగదక్షితీంద్రా! నిశ్చలధ్యానయుక్తుం డగు నీకుమారుని ధర్మాంగదుని లేవనెత్తుము.

చ. వనముల కేఁగి దారుణతపంబున మే నలయింప నేల? నె
మ్మనమున కింపుగూర్చుప్రియకాంతల నాత్మజులం ద్యజించి పె
న్వనటలఁ గుంద నేల? గృహవాసమె సేయుచు నిన్నుఁ బోలె న
న్ననయము గొల్చునట్టియనఘాత్ములె యుత్తములంచు నెంచెదన్.48.

రుక్మాం.—దండకము. (సాంజలియై) శ్రీమానినీ హృత్పయోజాబ్జమిత్రా, మహేంద్రాదిబృందారకస్తోమసంస్తుత్యచారిత్ర, దోషాటవీవీతిహోత్రా, మహాఘోరసంసారసంతాపదావాగ్ని యుష్మత్కృపాదృష్టిచేఁ గాక చల్లారునే దేవదేవా, హరీ, పాపుఁడన్ బాపసంభూతుఁడన్ నేరమిన్ నేర్చియున్ మెండుగాఁ జేసితిన్ బాపముల్ నన్ను నుద్ధాత్ముఁ గావింపవే దీనబంధో, మహామోహగాఢాంధకారావృతాత్ముండనై నీవిలాసంబు నేనెన్నఁగా లేక యీబాలుని న్నీకు నర్పింపుమం చీసరోజాక్షి పంతంబునం బల్కఁగా వంతపాలైతి లోకంబు సర్వంబును న్నీవ, నీదేయంట చెన్నలేనైతి స్వామీ, దయాళూ, భవత్పాదపంకేరుహద్వంద్వముం గాంచినంతన్ సహస్రాంశుదీప్తిన్ దమంబట్లుసంక్షీణమయ్యెన్ మదజ్ఞానపుంజంబు కామాదిచేతోవికారంబులెల్లన్ దొలంగెన్, మదీయాంతరంగంబు నిష్కల్మషానందసంపూరితంబయ్యె, నీసన్నిధిన్ జేర్చుకొమ్మీ, రమేశా! నమస్తే నమస్తే నమస్తే నమః.

[తాపసులు ప్రవేశించి]

తాపసులు.—(బాలుని కవుంగిలించుకొని) వత్సా! నీమూలమున మహాయోగసిద్ధివలనఁ గూడ గాంచ దుర్లభం బైన యీ పురాణపురుషుని నారాయణుని సందర్శనంబు లభించె.

శ్రీహరి.—రుక్మాంగదక్షితీంద్రా! ముక్తులయ్యును జగదుద్ధరణపరాయణత్వమునఁ గామరూపంబుతో మర్త్యలోకంబునఁజరించుచు తత్త్వజ్ఞానంబువిస్తరింపఁ జేయుచున్న మహానుభావులు వీరు. వీరిచేఁ బ్రబోధితుండై నీ కుమారుండు నిస్సంగుఁడయి లోకహితంబర్థించి తన శిరంబు తెగుట కియ్యకొని శ్రీహరివాసరవ్రతము వెలయించె. ఈ మగువ నీచిత్తశుద్ధి పరీక్షింపఁ బంకజాసనుని పనుపున వచ్చినతన్నాసపుత్త్రిగాని పామరస్త్రీగాదు.

రుక్మాం.—స్వామీ ఈ విషయమిదివఱకే గోచరమైనది. ఈ వనితను చిత్తసంతాపభరంబునఁ దూల నాడితిని. ఆపాపము శాంతించున ట్లనుగ్రహింపుము మహాత్మా!

శ్రీహరి.—భక్తాగ్రేసరా! నీ వేమివరంబు వేఁడినను ఒసంగఁగౌతూహలంబయ్యెడిని. వలయు వరంబులను వేఁడుము.

రుక్మాం.—దేవదేవా! ఈ తాపసేంద్రుల శుశ్రూషచేయుచు జగదుద్ధరణపరాయణాత్ముండనై యీ లోకమునఁ గొంతకాలము వసించి పిదప నీ సాన్నిధ్యంబు చేరునట్లు వరము ప్రసాదింపుఁడు.

శ్రీహరి.—రాజచంద్రా! నీవు కోరినట్లు యగుంగాక. బాలకా! నీ వేమి వరంబు వేఁడెదవు?

ధర్మాం.—మా తండ్రిగారికి బ్రసాదించిన వరమే నాకు ననుగ్రహింపుఁడు.

శ్రీహరి.—సాధ్వీమణులారా? మీ రేవరమ్ము వేఁడెదరు.

రాజభార్యలు.—సర్వాభీష్టదాయకా! మా ప్రాణవల్లభు లెచ్చటనున్న నచ్చటనే నిరంతరము వారి పాదసేవసేయుచుండవలయు నను నదియొకటె మా యభీష్టము. అయ్యది యవిచ్ఛిన్నముగ నెఱవేఱునట్లు ప్రసాదింపుఁడు.

శ్రీహరి.—మీ కోరిక సిద్ధించుఁగాక. మోహినీ! నీ వేమి కోరెదవు.

మోహిని.—నా మనం బీ రాజశేఖరునిచే నపహృత మైనది. నా సపత్నుల కొసంగిన వరమే నాకునుఁ బ్రసాదింపుఁడు.

శ్రీహరి.—రుక్మాంగదక్షితీంద్రా! మిక్కిలి బడలితివి. మఱి యేదేని వేఁడ నిష్టమున్నఁ వేఁడుము.

రుక్మాం.—నా కింకనుఁ గోరందగిన వరములు లేవు. అయిన నీ వర మొసఁగుఁడు.

తరల. ధరణి సస్యసమృద్ధి నొప్పఁగ, ధర్మ మెప్పుడు వర్ధిలన్,
గురుజనంబులు పూజలం దగఁ, గూళ లెల్ల నడంగఁగా,
సరణి దప్పక జాతులెల్లను సంచరింపఁగ, మేదినీ
వరులు పాలనసేయుచుండుత వారిజోదర నిత్యమున్. 49.

శ్రీహరి.—తథాస్తు. [అని అంతర్ధాన మగును.

[అందఱు నిష్క్రమింతురు.

ఇది షష్ఠాంకము.

రుక్మాంగద నాటకము

సంపూర్ణము.

——

# శోధన పత్రిక.

| పుట | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 20 | 22 | యగును | యై జ్ఞానోదయంబగు. |
| 21 | 14 | గతపంకము. | గతదోషము. |
| 37 | 1 | అనిచెప్పెను. | అనిచెప్పను. |
| 39 | 17-18 | వం। చనమెయి. | దం। దనమున |
| 41 | 3 | యెట్లు? | యెట్లు? జ్ఞానంబునంగాక |
| | 11 | నిర్మలాత్ములై | నిర్మలాత్ములై జ్ఞానులై |
| 45 | 19 | కార్యసాధనా | కార్యసాధన. |
| 79 | 10 | నుండనై | నుండనైననాకు |
| 84 | 12 | మీయెడఁ | మీయెడ దయ |
| 87 | 10 | దినమున | విధమున |
| | 15 | గానము నల్ప | గానము సల్ప |
| 89 | 2 | చ. అలజడి | { మోహిని.— చ. అలజడి. |
| 92 | 13 | నొంసగ | నొసంగ |
| 95 | 2 | బైనవా | బైన |
| | 3 | కట్టిమాలిన్యము | కిట్టి కళంకము |
| 96 | 3 | నోపుదును. | నోపుదును. నీకోఅక్కైయాపరమసాధ్విని |
| | 15 | వెంబడించి | (వెంబడించి |
| | 16 | ((ప్రకాశముగా | (ప్రకాశముగా. |
| 100 | 6 | పేదవానివలె | పెఱవానివలె |
| 102 | 19 | జమునగన | జగమున |
| 106 | 1 | గుత్తినివాతని | గుత్తినివాయన |
| | 7 | పావనా. | వంశపా |
| | 8 | వాత్మోద్భవు | వాత్మోద్భవుఁ |
| | 14 | జలిపింపుశిరంబు | జలిపించుచుశిరంబు |
| 107 | 6 | ప్రియకాంతల | కులమానిని |
| | 13 | బంధో | బంధూ |
| | 15 | యంటచెన్న | యటంచెన్న |
| 108 | 24 | నిష్క్రమిమితురు | నిష్క్రమింతురు |

